నలుబది రెండవ పూజా పుష్పము

# ఆనందయాత్ర

(లలిత గీతాలు)



దుర్గాప్రసాద్

ప్రథమ ముద్రణము

500 ప్రతులు



శ్రీ ప్రమాథి నామ సంవత్సర
ఆషాఢ పూర్ణిమ

1999 జూలై

వెల : రు. 20-00

ముద్రణము :
డి. వి. ప్రింటర్సు
విజయవాడ-2

---

ప్రతులకు :
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞానభవన్, బ్యాంకు స్ట్రీట్, హైదరాబాదు
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
అన్ని బ్రాంచీలలో లభ్యమగును

పి. దుర్గారావు, యం.ఓ.యల్.
అడవిదేవులపల్లి (పోస్టు)
(వయా) మిర్యాలగూడ, నల్లగొండ జిల్లా
508207

## మాతృ వందనము

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందన మిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!

సకలసస్య శ్రీనిలయిని! సాధుమార్గ శుభదాయిని!
సర్వలోక జనపూజిత! సామగాన సురభాషిణి!
సకలధర్మ సహజీవన సంస్కృతి విలసిత శోభిని!
పుణ్యకర్మ సువిరాజిత పూర్ణకళా తేజోమయి!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందన మిదె ప్రియభారతి!

గంగ యమున గోదావరి కావేరీ కృష్ణవేణి!
ఉన్నత హిమగిరి శిఖరము లొప్పిన శుభ కల్యాణి!
అడుగడుగున పుణ్యభూము లెసరు విమల సౌమ్యమూర్తి!
మధుర కావ్యగేయ శిల్ప మంజులతర శివగాయని!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె ప్రియభారతి!

సత్యము శివ సుందరములు సర్వదిశలు విలసిల్లిన
ఈ సుందర కర్మభూమి! ఈ పవిత్ర దివ్యధాత్రి!
నీ స్వరూప విలసనమే! నీ యనంత దర్శనమే!
అమ్మా! నీ యాశీస్సులు నలరి వేడుచుంటి నమ్మ!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

## దేవతా వందనము

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

యోగివంద్య జ్ఞానజ్యోతి! సారస్వత స్వాదురూప!
మృదుపద సుందరభావన! కవికులజన వరదాయిని!
విశ్వరూప! విమలచరిత! అక్షరరూపిణి భారతి!
లలిత లలిత పదశోభిని! లాలిత సుందర భాషిణీ!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

ఉదయసంధ్య అరుణారుణ రేఖాంకిత సదయనేత్రి
కరుణామయి! కావ్యగేయ గాన కళా సుప్రసన్న!
అజరుద్రాచ్యుత పూజిత! ఆదిరూప! సుఖదాయిని!
బుధసేవిత! ధవళవర్ణ! భూరికృపానంద లహరి!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

లలితకళా నందమూర్తి విలసిత చైతన్యమూర్తి!
మానవ విజ్ఞాన భాండ మధుర సుధాకలశహస్త!
శివరూపిణి! ప్రణవనాద! తేజోమయి! దీపరేఖ!
అఖిల జీవకోటి హృదయ! ఆనందిని! శ్రీదుర్గా!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

# కల్యాణి శ్రీదుర్గ !

కల్యాణి శ్రీదుర్గ ! కరము వేడుచునుంటి
కనులార! నను జూచి కాచి రక్షింపూ!

ఆర్ద్ర భావముతోని యరసి కాపాడుమా!
తీయనీ పలుకిచ్చి ధీరుగా దయతోని!

కల్యాణి శ్రీదుర్గ ! కరము వేడుచునుంటి!
కనులార నను జూచి కాచి రక్షింపూ!

అడుగడుగు నందునను నమృత వాక్కుల నిచ్చి
మధురాతి మధురమౌ మధుర భావములిచ్చి!
సంగీత సాహిత్య సరసమౌ గీతికల
నా నోట బలికింపు సర్వసుందరములను! ॥కల్యాణి॥

కొండ కోనలయందు కోకిలలు బాడినటు!
సెలయేటి జాలులటు! జిరుగాలి తరగలటు!
ఉదయ సంధ్యలలోని కదిలేటి కాంతులటు!
నా గొంతురాగాల నవ్యతల దొలికించు! ॥కల్యాణి॥

లలిత కళలను నిచ్చి లాలిత్యమును గూర్చు
విభుని వశబఱచుకొను విమలతను దయచేయి!
శ్రీమురళి జేరుకొను శ్రీని దయజేయుమా!
పాటలో పాటనయి పల్లవిని యగునటుల!

కల్యాణి శ్రీదుర్గ ! గరము వేడుచునుంటి!
కనులార! జూచి నను కాచి రక్షింపూ!

# వినయ వాక్యము

"ఆనంద యాత్ర" అను ఈ లలిత గీతాల పుస్త
నలుబది రెండవ పూజా పుష్పముగా తెలుగు
సరస్వతీ చరణారవిందములకు భక్తి పూర్వకముగా సమ
కొనుచున్నాను.

ఉపాధ్యాయ వృత్తిని నిర్వహించుకొనుచు అప్పు
వ్రాసికొనినవి యీ గీతములు. మధుర భక్తిని మనోహ
వ్రాసికొనిన మహాభక్తురాలు మీరాబాయి, శ్రీ గో
క్రీ.శే. దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారి మధుర గీత
యీ లలిత గీతములకు ప్రేరణయని చెప్పవచ్చును.

ఈ గ్రంథమున శ్రీకృష్ణదేవుని నాయకునిగా
మధుర భక్తితో రచించిన గేయములను శ్రీకృష్ణుని
విందములకే అర్పణము గావించుకొనుచున్నాను.

ఇందు నాయకునిగా వర్ణింపబడిన శ్రీకృష్ణుడు
లోలుడేగాక) పరబ్రహ్మ స్వరూపముగను, ఇందలి
విరహము పరమేశ్వరునియందు లీనమగుటకు వేదనా
మగు జీవి ప్రార్థనగా భావింపవలెను.

ఇదివఱలో ప్రచురించిన లలిత గీతములను ప్రశంసించుచూ పత్రికలు, ప్రముఖులు వ్రాసియున్నారు. వారందఱికిని నా నమస్సుమాంజలులు! ఇదే విధముగా మఱికొన్ని గ్రంథములు ప్రచురింపవలెనని నా ఆకాంక్ష !

ఈ గ్రంథమునందుగల **108** గీతములు సాధ్యమైనంత వఱకు పాడుకొనుట వీలుగా లలిత పదములతో గుదిగ్రుచ్చబడినవి. ఆకాశవాణి, టి.వి.లలో బాడుకొనుటకు వీలుగా తేలిక భాషలో నున్నవి. కృష్ణ భక్తి పరిపూర్ణమైనవి.

రస హృదయులను ఏమాత్రము స్పందింపజేసినను ధన్యునిగా భావించుకొందును.

—రచయిత.





## స మ ర్ప ణ

ఎన్ని మారులు పాడినా
వన్నె తరుగదు నీ పాటకు!

ఎన్ని మారులు విన్నా నీ మురళీ స్వనాలకు
వన్నె లేమీ తరుగవు గదా!

మఱచి పోవాలన్నా మాధవా!
మఱపురాదు నీ పేరు!

విడిచి పోవాలన్నా వీడిపోదు
విడివడని బంధ మిది యేనాటిదో!

తీయని నీ మురళి పాట
తీపిదనం కురిపిస్తుం దెప్పుడూ!

నర్తన జేస్తుం దెప్పుడూ నా యెదలో
సర్వ సుందరములను వెలువరిస్తూ!

అందుకే అర్పిస్తున్నా
ఆత్మార్పణమని!
ఆవేదనతో నా మధుర గీతాలను!

యుగయుగాల నాటి ఈ మధుర పదాలు!
తరతరాల నాటి దీ హృదయా వేదన!

# ఆనంద యాత్ర

## లలిత గీతాలు

నీ నిరీక్షణము నే నిర్మలంబగు మదిని
ఎదురుజూతును స్వామి! తుదిక్షణము వఱకూ!

నాల్కపై నీ పాట నాట్యమాడే దాక
కనులు కాంతులు తగ్గి కాటుకలు యగుదాక!

నీ నిరీక్షణము నే నిర్మలంబగు మదిని
యెదురుజూతును స్వామి! తుది క్షణము వఱకూ!

ఎన్ని వసంతాలు జెన్నుగా గడిచినా,
ఎన్ని ఋతువులు మారి యిమ్మగా బోయినా,
నే బ్రతికి నన్నాళ్ళు నీ నిరీక్షణము నే
నెదురుతెన్నులు గాంతు! నేకాంతమున కృష్ణ! ॥నీ నిరీక్షణము॥

ఈ సుగీతముతోని యీ యాత్ర సాగింతు!
అడవులను కొండలను నఖిల ప్రకృతినంత!
గిరి శిఖరముల నెక్కి కిన్నెరను బాడుతూ,
గగనాంతరంబులను గనుగొందు రాగమున! ॥నీ నిరీక్షణము॥

ఈ విరహగీతి మది విలసిల్లునందాక
యీ నిరీక్షణగూడ నిలుచు హృది తుదిదాక!
నీ కృపా కిరణమును నేను బొందెడిదాక
వేగుచుక్కకు మల్లె వేచియుందును స్వామి!

నీ నిరీక్షణము నే నిర్మలంబగు మదిని
యెదురుజూతును స్వామి! తుదిక్షణము వఱకూ!

## పిలిచినా నా పిలుపు !

పిలిచినా నా పిలుపు వలపు తీయని పాట
వినిపింపదా స్వామి! వీనులకు విందుగా!

నా పాట నందుకొని నలుదెసల యచ్చరలు
ఆడిపాడే చంద మగుపింపదా?

పిలిచినా నా పిలుపు వలపు తీయనిపాట
వినిపింపదా స్వామి! వీనులకు విందుగా!

కొండ కోనలలోని కోకిలమ్మలుగూడ
పాడుచున్నదిగూడ పాట నా పాటగద!
అలరి వన వీధిలో నందాల యా నెమ్మి
నా నాట్యమే గదా! నాట్యమాడుచునుండె ॥పిలి

తెలిమబ్బు గుంపులో తేలిపోయే హంస
నా యొయారములు గద నవనీత! నేర్పినది!
సెలయేటి యొంపులో గులికేటి జలకన్య
నయగారముల నన్ని నానుండి నేర్పినది! ॥పిలి

పిలుపు వినిపించుకొని ప్రీతి జూపవదేల?
మధురగీతములోని మధురిమలు గనవేల?
ఈ పాట! యీ యాట! యింపుగా శ్రీకృష్ణ!
నీ కోసమే గదా! నే నేర్చుకున్నదీ!

పిలిచినా నా పిలుపు వలపు తీయని పాట
వినిపింపదా స్వామి! వీనులకు విందుగా!

## శ్రీ కరంబైన నీ!

శ్రీ కరంబైన నీ చిన్నారి పాదాల
కనులార గాంచనీ కమనీయమూర్తీ!

మనసార నిను దలచి మధుర కంఠముతోని
తీయనీ గీతమును దీరుగా బాడనీ!

శ్రీ కరంబైన నీ చిన్నారి పాదాల
కనులార గాంచనీ కమనీయమూర్తీ!

నీ సొగసు నెమ్మోము నిలిచి నను జూడనీ
నీ మురళిగానమును నే విన్నగ వలెనోయి!
నీ యడుగుజాడలను నే నడువవలెనోయి!
నీ నీడలో నేను నిలిచిపోవలెనోయి! ॥శ్రీ కరంబైన॥

నీ మురళి రాగాలు నా పాట శ్రుతిలయలు
ఏకమై పోవాలి! లోకమంతా విరిసి!
ప్రణవ నాదమువోలె భవ్యమగు ధ్వనితోని
అమర గీతమువోలె యంతటా నిండాలి! ॥శ్రీ కరంబైన॥

సాధుభావముతోని సర్వస్వ మర్పించి,
సఖియనై పోతినీ సరిగమల బాడుచును!
నీ నిరీక్షణమునను నే దిరుగుచుంటినీ,
వాడవాడలయందు వీధి వీధుల యందు!

శ్రీ కరంబైన నీ చిన్నారి పాదాల
కనులార గాంచనీ కమనీయమూర్తీ!

## నీ నిరీక్షణమందు!

నీ నిరీక్షణమందు నిఖిల! నా కన్నీరు
గలగలా ప్రవహించి కడలి జేరినదీ!

అలలతో తెరలతో నల నీటి నురుగులను
సుడులతో ముడులతో చోద్యమగు ధ్వనులతో!

నీ నిరీక్షణమందు నిఖిల! నా కన్నీరు
గలగలా ప్రవహించి కడలి జేరినదీ!

కొండకోనలయందు గూర్మి నా కన్నీరు
వక్రముగ బ్రవహించి వరుస మైదానముల!
కాషాయి రంగుతో గలరూపు దిద్దుకొని-
మిట్టపల్లములందు మిసమిసలు జిందుచును! ॥నీ నిరీక్షణము॥

కలువ తామరలతో గలిసి బ్రవహించినది
నీటి పక్షులుగూడ నిలిచె తీరములందు!
జీఋత పులులునుగూడ జేరి తరులందునను
దప్పికంతయు దీర త్రాగుచున్నవి నీరు! ॥నీ నిరీక్షణము॥

విరహవేదననంత వేగముగ ధరలించి
మనసు బాధను మాన్పి మధురరూపము జూపి!
మురళిబాడుచు కృష్ణ! మోద మలరగ నన్ను
ఆనంద వార్ధినీ యటుదేల్చు మో స్వామి!

నీ నిరీక్షణయందు నిఖిల! నా కన్నీరు
గలగలా ప్రవహించి కడలి జేరినదీ!

## అందాల నీ మురళీ!

అందాల నీ మురళి యాలకింపగ నెంచి
మందార మాలతో మదిభక్తి గూడి!

ఎదురుజూచుచునుంటి యేకాంతమున కృష్ణ!
మదియందు దలచుచును మధురమగు గీతితో!

అందాల నీ మురళి యాలకింపగ నెంచి
మందార మాలతో మదిభక్తి గూడి!

కడలి తెరలకువోలె కల లెన్నొ గాంచుచును
మదియందు ముత్యాల మాలలను గూర్చుచును!
వీణ తంత్రులు మీటి వేవేల రాగాల
బాడుకొను చుంటినీ భవ్యమగు గీతాల। ॥అందాల॥

ఆలకించుచు గీతి యలసిపో నెందుకని?
యాపదల యందునను నానందమును గాంతు!
నీ నిరీక్షణముననను నిలిచినా నా కనుల
ఆనందభాష్పములు నటు రాలు నెందుకని? ॥అంధాల॥

నీ నిరీక్షణము సఖ! నిజము కాబోలునూ!
నిను వెదుకుటయె నాకు నిండువెన్నెలయగును!
నినుగూర్చి బాడుచే నిర్మలానందమును
మదియందు స్పందనలు మాటిమాటికి గలుగు!

అందాల నీమురళి యాలకింపగ నెంచి
మందారమాలతో మదిభక్తి గూడి!

## చిఱునవ్వుతో గలువ!

చిఱునవ్వుతో గలువ జింధులాడిన యటుల
నా మనసు విరియునా? నాథ! యెపుడైనా!

హరివిల్లు గగనాన యందాలు విరిసినటు
చింది నే నందాలు చిత్రగతి నుంధునా?

చిఱునవ్వుతో గలువ జిందులాడిన యటుల
నా మనసు విరియునా? నాథ యెపుడైనా?

మధురమురళిని మ్రోయు మాధవుని జతగూడి
యమునయొడ్డున జేరి యలరి విహరింతునా?
ఆలమందల మేపు నాచిన్ని గోపాలు
పదములను జేరి నే పాట బాడుదునా? ॥చిఱునవ్వుతో॥

సురపొన్నలనుగూడి చిత్రముగ మురళినీ
పాట బాడెడివాని భక్తి జేరుదునా?
అందాల గోపికల యా రాసకేళిలో
నే గోపకాంతనై నిలిచి యాడుదునా? ॥చిఱునవ్వుతో॥

అందాల తీవెలను నపురూప పూవునై
పైకెగిరి గగనాన పాట బాడుదునా?
అందుకొని గోవిందు హత్తుకొని హృదయాన
పాదములను వ్రాలి నే పరమగతి నొందుదున?

చిఱునవ్వుతో గలువ జందులాడిన యటుల
నా మనసు విరియునా? నాథ! యెపుడైనా!

## ఆలమందనుగాయు

ఆలమందను గాయు! నాటకా యొక్కడును
జిఱునవ్వుతో దెలిపె! చిత్రమగు వార్తా!

కొండకోనలయందు కోనేరు దాపునను
పాడుబడినా గుడిని పరమాత్మ యుండెనని!

ఆలమందను గాయు నాటకాయొక్కడును
జిఱునవ్వుతో దెలిపె చిత్రమగు వార్తా!

నిజమనుచు నే నమ్మి నిర్మలంబగు భక్తి
నిన్ను దర్శించితిని! నీ దాపు జేరి!
శిథిల శిల్పమునందు జిత్రమగు నీరూపు
నపురూప యందముల నగుపించె నాకనుల! ॥ఆల॥

అరిగి విఱిగిన నీదు నందాల శిల్పమును
నాభక్తి గీతాల నవ్యత్వమును గూర్చి!
గొలుచుచున్నాడ నే గోవింద! నిత్యమును
నాదు నన్వేషణము నవనీత! ఫలియింప! ॥ఆల॥

నిను గంటి ననుచు నా మది సంతసము నందె
ఎవరులేనట్టి యీ యేకాంతదేశమున!
దీపమును వెలిగించి దివ్య శిల్పమునందు
నిను గాంచినటుల నే నిఖిలేశ! దలచితిని!

ఆలమందను గాయు నాటకా యొక్కడును
జిఱునవ్వుతో దెలిపె చిత్రమగువార్తా!

## సెలయేఱు శిలదాకి

సెలయేఱు శిలదాకి చెదిరినా రీతినీ
నా గుండెలో పాట నవనీత జెదిరినది!

మదిలోని భావాల మధురిమలు మాసినవి!
గొంతులో రాగాల కొసలన్ని మాసినవి!

సెలయేఱు శిలదాకి చెదిరినా రీతినీ
నా గుండెలో పాట నవనీత! చెదిరినది!

చిఱునవ్వు మాసినది చిత్రముగ గీతిలో
ఆనందభాష్పములు నంతరించిన వేపుడో!
చిత్తశాంతియు గూడ చితికిపోయెను ప్రభూ!
కఠినశిలలను దాకు కమ్మనీ అలవోలె! ॥సెల॥

శ్రుతిలయలు దప్పినవి చోద్యముగ పాటలో!
విరజిమ్మబడె నాదు విమల పదజాలమును!
మధురగీతముగూడ మౌనముద్రను దాల్చె
వీణదీవెలు దెగెను విమలధ్వనులను మానె! ॥సెల॥

నీ విరహమున గదా! నే నిటుల నైతినీ
బాటతప్పినయట్టి బాటసారికి వోలె!
గమ్యమును మఱచితిని కలతనలతను గూడి
పయనించుచుంటినీ పద్మనాభా! యెటకో!

సెలయేఱు శిలదాకి చెదిరినా రీతినీ
నాగుండెలో పాట నవనీత! చెదిరినది!

## హరి యదిగో వచ్చెనని!

హరి యదిగో! వచ్చెనని యలరి బలుకవె చెలియ!
మది వేద నంతయును మాయమగు నటులా!

నా నిరీక్షణమంత నవనీతు రాకచే
కలువ తామరలవలె కాంతు లుదయించు మది!

హరి యదిగో! వచ్చెనని యలరి బలుకవె చెలియ!
మది వేద నంతయును మాయమగు నటులా!

అందాల తారకల యలరు మెట్లను దిగుచు
సుందరంబగు సంధ్య యందాల వన్నెలను!
దాటుచును ధరణిపై దాసినగు నను బ్రోవ
పయనించి వచ్చెనని బడతి! వే దెలుపవే! ॥హరి॥

కోకిలా! పలుకవే! కూర్మి కంఠమునెత్తి
మధురమౌ కంఠమును మాణిక్యములు రాల!
వన్నెలా కృష్ణుడూ వచ్చుచున్నా డనుచు
జిఱునవ్వునను దెలుపు జిత్రమగు పాటతో! ॥హరి॥

వనమయూరీ బలుకు వయ్యారి నర్తనల
రాజనర్తకివోలె రమణీయముగ దెలుపు!
మురళి బాడుచు వేడ్క ముద్దు గోపాలుడూ!
వచ్చుచున్నాడనీ వగలాడి దెలుపవే! ॥హరి॥

చిలుక గోరింకలూ! చిన్నారి పిచ్చుకలు
హరి రాక దెలిపి నన్నానంద బరుపరే!
ఎదురుచూపులు మాని యేకాంతమును మాని
హరి చరణ కమలముల నటు నొరిగిపోదునే! ॥హరి॥

## వినిపింపగా రాద!

వినిపింపగా రాద! విమల మురళీ స్వనము!
కనిపింపగా రాద! కనుల పండువుగా!

నీ నిరీక్షణమందు నిఖిల! మే మందఱము
కలత నలతల దొరలు కన్నీరుగాంచుమా!

వినిపింపగా రాద! విమల మురళీ స్వనము
కనిపింపగా రాద! కనుల పండువుగా!

అల సముద్రమునందు నపురూప భక్తితో
అలలు తెరలును గూడ యాలపించుచు గీతి!
శరవేగమున దరికి చయ్యనా జనుదెంచి
సూటిగా నిను గనక శూన్యమగుచున్నవి! ॥వినిపింప॥

వాడినా పూవులను వరుస నేలను రాల్చి
క్రొత్తపువ్వుల కొసల కూర్మితో ఋష్పించి!
నీ రాక కొఱకునై నిలిచియున్నవి గనుము!
అందాల పూ లతలు! నంతటను వనవీధి! ॥వినిపింప॥

గుండెలో నాపాట క్రొత్త రాగములతో
బాడుచున్నది గనుము! పద్మనాభా! భక్తి!
ఒకసారి దయతోని యొప్పుగా గనిపించి
ఆదరింపగరాద! యఖిలేశ! కరుణతో!

వినిపింపగా రాద! విమల మురళీస్వనము
కనిపింపగా రాద! కనుల పండువుగా!

## వాదులాడకు మమ్మ!

వాదులాడకు మమ్మ! వగలాడి జిలుకమ్మ!
మాట సూటిగ బలుకు! మమతలను గూడి!

గోపాల బాలు డిటు గూర్మితో వచ్చెనా?
మధుర మురళిని బాడి మధురిమల దేలికెనా?

వాదులాడకు మమ్మ! వగలాడి జిలుకమ్మ!
మాట సూటిగ బలుకు! మమతలను గూడి!

నా స్నేహ పూమాల నా నాధునకు నిచ్చి
కమనీయ పదములకు కాన్క నొసగితివా?
మధుర గోపికనంచు మాధవునితో దెలిపి
మమత గలిగేటటుల మాటలాడితివా? ॥వాదులాడకు॥

మనసులో నున్న నా మధురమగు కోరికను
నోరార బలికి నా మొరను వినిపించితివ?
తెలిపితివో లేదో తెలియజేయుము జెలియ!
తీయనీ మాటలను దేటగీతముగాగ! ॥వాదులాడకు॥

చిలుక నీ పలుకులను జియునవ్వు నవ్వెనా?
మనసిచ్చి మాటాడి మమతలను దెలిపెనా?
సిరులిచ్చు నా స్వామి చిత్రముగ మాటాడి
దాసినగు నను బ్రోచి దయజూతు ననిమెనా?

వాదులాడకు మమ్మ! వగలాడి జిలుకమ్మ!
మాట సూటిగ బలుకు మమతలను గూడి!

## నిర్మలంబగు మదిని!

నిర్మలంబగు మదిని నెచ్చెలీ! బయనించి
దారి బోవుచునుంటి దర్శింప హరినీ!

ఒక పూరిగుడిసెలో నొప్పుగా శ్రీ మురళి
మానినీ! వినిపించె మధురమగు ధ్వనులతో!

నిర్మలంబగు మదిని నెచ్చెలీ బయనించి
దారి బోవుచునుంటి దర్శింప హరినీ!

తలుపు దెఱచీ నేను దగ బోతి లోపలికి
దర్శింపగోరి యా హరిని గోపాలునీ!
దయనీయ దృశ్యమును దర్శించితిని చెలియ!
శూన్యమగు కుటియందు చోద్యముగ నేనూ!

దిక్కు మొక్కూ లేని దీనుడగు వృద్ధునీ
ఆకలిని దాహమున నల్లాడుచున్నట్టి!
కనుకొనలలో నీరు గదలాడుచుండినా
దీనమానవుని చెలి! తేరిచూచితినమ్మ!

ఆకలిని దీర్చితిని యాహారమును నిచ్చి
దాహమును దీర్చితిని దరి నున్న జలములను!
సేదతీర్చితి నతని తీయనీ పలుకులను
నాత్మీయ వ్యక్తిగా నలరించితిని వాని!

వృద్ధ మానవసేవ యూహించితిని మదిని
శ్రద్ధయును భక్తియును శాంతి జనియించినది!
బాలగోపాలునీ బన్నుగా దర్శించి
మధుర మురళిని వినిన మాధుర్య మనిపించె!



ఆనం

## కల మందుకోను

కల మందుకోను! నా కలత మది దెలుపనూ!
విరహగీతికలోని వేదనను దెలుపనూ!

నీ నిరీక్షణలోని నిదురలో నైననూ
కలగాంచబోను సుమ! కమనీయముగ రాత్రి!

కల మందుకోను! నా కలత మది దెలుపనూ!
విరహగీతికలోని వేదనను దెలుపనూ!

కలహంస నటుగాంతు గఱకు చూపులతోని
వనమయూరిని కసిరి వనములకు బొమ్మందు!
చిలుక గోరింకలా చిత్రమగు బలుకులను
వినను బొండని బలికి వెడలనంపుదు వనికి! ॥కల॥

కలువ తామర పూల కనుచూపు మేరలను
నిలువబోకు డటంచు నిరసింతు తారలను!
మావికొమ్మలను గల మధుర కోకిలలనూ
పాటబాడకు డంచు బన్నుగా శాసింతు! ॥కల॥

నీ విరహమున స్వామి! నే నిటులనైతినీ
మది చంచలంబాయె మాట స్మృతి దప్పినది!
కమ్మనీ వెన్నెలలు గాఢ జీకటు లాయె
తారకలు నిప్పులై దఱుముచున్నవి నన్ను!

కల మందుకోను! నా కలత మది దెలుపనూ!
విరహగీతికలోని వేదనను దెలుపనూ!

## పుష్ప వాటికయందు

పుష్ప వాటికయందు బొలుపుగా నుందువని
వెదుకుచుంటిని నిన్ను వేణుగోపాలా!

చిలుకమ్మ జెప్పినది చిత్రమగు నీవార్త
తీయనీ పలుకులను దేనె తొలుకగనూ!

పుష్పవాటికయందు బొలుపుగా నుందువని
వెదుకుచుంటిని స్వామి! వేణుగోపాలా!

గరిక పూవులపైని కమనీయ కాంతులను
మంచుబిందువులలో మాణిక్య సొగసులను!
సుప్రభాతమునందు జోద్యముగ నిలుచును
మురళి నూదెదవనుచు మోదమున బలికినది!

ఉదయ సంధ్యలయందు నొప్పారు మంచుపుల
రాగియాకుల చివఱ రమణీయముగ నిలిచి!
ఒక్కొక్క బిందువుగ చక్కనగు ధరణిపై
మక్కువగ బడుదువట మాధవా! దయతోని!

వెదుకుటకు వచ్చితిని వేణుగోపాల! నిను
వనవీధి యంతటను నొప్పుగా గాంచుచును!
నీ మురళి రవములను నిఖిల నే వినుటకై
వేచి యుంటిని యిచట వేణుగోపాలా!

పుష్పవాటిక యందు బొలుపుగా నుందువని
వెదుకుచుంటిని నిన్ను వేణుగోపాలా!

## ముత్యాలసరులలో

ముత్యాల సరులలో ముద్దుగా నిను జేర్చి
పాట బాడితిగదా! బరవసించుచునూ!

భావాలు, రాగాలు బరిమళించే ఋతుల
నీ పాద పద్మాల నిలిపితిని గద కృష్ణ!

ముత్యాల సరులలో ముద్దుగా నిను జేర్చి
పాటబాడితిగదా! బరవసించుచునూ!

తీవె జివరలనున్న చిఱుమల్లియల దెచ్చి
మంజులంబగు పూల మాలగా గ్రుచ్చితిని!
రావేల శ్రీకృష్ణ! రమణీయ నడకలను
దాసిపై కరుణించి దయజూప రావేల? ॥ముత్యాల॥

ఉదయభాస్కరు డదిగో! యుదయించె దూర్పునను
మధుర సంధ్యలను మఱి మమతతో జేర్చుకొని!
మాధవా! నన్నేల మమతతో జేర్చుకొని
బాలింపవేల నను బరగ శ్రీమురళితో! ॥ముత్యాల॥

నీ నిరీక్షణమందు నిలిచినా నామనసు
కలత బొందినదిగద! కమనీయతను వీడి!
చిఱునగవు కాంతులును జిత్రముగ మాయమై
మూగినైపోతినీ మోహమున నీపైని!

ముత్యాల సరులలో ముద్దుగా నిను జేర్చి
పాటబాడితిగదా! బరవశించుచునూ!

## నీ నిరీక్షణమందు!

నీ నిరీక్షణమందు నిలిచి నే వనవీధి
పాటబాడుచు నుంటి బరవశము జెందీ!

మావికొమ్మను వదలి మధురపుంగోకిలలు
ననుజుట్టె వలయముగ నవనీత! గనుమోయి!

నీ నిరీక్షణమందు నిలిచి నే వనవీధి
పాట బాడుచునుంటి బరవశము జెందీ!

వనమయూరంబులును వరుస బారులు దీర్చి
కమనీయ నర్తనలు గరము జేయుచునుండె!
ఆకాశ మల్లియలు నందాల వనవీధి
ఒక్కొకటి రాలుచును చక్కదనమును జిందె! ॥నీ నిరీక్షణ॥

చిలుక గోరింకలును జిత్రముగ నను జేరి
విరహవేదనను మఱి విమలమగు బలుకులను!
భాషించుచున్నవి! పతితపావన! వినుము!
నీటిపక్షులుగూడ నీడవలె నను జుట్టె! ॥నీ నిరీక్షణ॥

వనవీధి దుమ్మెదలు వన్నెలా బువ్వొడుల
నందించినవి నాకు నపురూప మగునటుల!
పరమభక్తిని నీకు పాదపూజను సేతు
కరుణతో రావోయి! గలకోర్కె దీరగా!

నీ నిరీక్షణమందు నిలిచి నే వనభూమి
పాటబాడుచు నుంటి పరవశము జెందగా!

## మబ్బులో తారకలు!

మబ్బులో తారకలు మాటుమణిగిన రీతి
నా గుండెలో పాట నలిగిపోయినదీ!

పిలిచి పిలిచీ కృష్ణ! యలసిపోయితినోయి
యడవిలో బరుగెత్తు నందాల లేడిలా!

మబ్బులో తారకలు మణిగిపోయిరీతి
నా గుండెలో పాట నలిగిపోయినదీ!

కొలనులో దామరలు గూరిమిని విడనాడి
మంచు ముత్యాలలో మాసిపోయిన రీతి!
నా మధురగీతమును మాసిపోయినదోయి
విరహగీతము లోని విమలతను విడనాడి! ॥మబ్బులో॥

తొలిసంధ్య కాంతులను లలితకాంతులు వీడి
భాస్కరుని జ్యోతిలో పొలిపోయిన విధము!
నా మధురగీతమును నలుమూలలను జెదిరి
కాటుకల గుంపులో గలిసిపోవుచునుండె! ॥మబ్బులో॥

నీమురళిలో గలియ నిండుపున్నెపు పంట
లేదేమొ నా స్వామి! లీలగా దెలిసినది!
పాటయిన మది నిలుపు బంగారుకొండగద!
బాడుకొందును బ్రతుకు బరువు తొలిగేదాక!

మబ్బులో తారకలు మాటమణిగిన రీతి
నా గుండెలో పాట నలిగి పోయినదీ!

## పత్రికను గొనిపొమ్ము !

పత్రికను గొనిపొమ్ము! ఐరగ నే వ్రాసినది!
ముద్దుగోపాలునికి మురిపెముగ నిమ్మా!

రద్దిజేయక వచ్చి రమ్యవర్ణన మిచ్చి
ముచ్చటగ బొమ్మనవె! మోదమున హంసా!

పత్రికను గొనిపొమ్ము! ఐరగ నే వ్రాసినది!
ముద్దుగోపాలునికి మురిపెముగ నిమ్మా!

కాటుకను కన్నీరు గలిపి వ్రాసిన దనుము!
మర్మవేదన యంత మగువ వ్రాసినదనుము!
మనసులో నీమూర్తి మాయలేదని యనుచు
గడియ గడియకు బిలిచి కాంక్షించు చున్నదను! ॥పత్రికను॥

ఎన్నిలేఖలు వ్రాసి విన్నపము లంపినా
చిన్నమాటను బలికి జేర్చుకో లేదనుము!
మనసు విరిగిన దనుచు మర్మముగ దెలుపుమా!
కన్నీటి మున్నీటిలో మునిగియున్నదను! ॥పత్రికను॥

వ్రాసినా యీ లేఖ రమణీయ వేదనల
వినిపింపవే హంస! విమల వచనములచే!
బ్రతుకనని దెలుపుమా! భవబంధములనుండి
విడిపింపుమని దెలుపు! విమల కవితలతో!

పత్రికను గొనిపొమ్ము ఐరగ నే వ్రాసినది!
ముద్దుగోపాలునికి! మురిపముగ నిమ్మా!

## చిఱుచేప గంతులను

చిఱుచేప గంతులను జెదిరినా కొలనులా
నా మనసులో దొలికె నవభావములు నూ!

కలువ యటు విరిసినటు కమనీయ గీతికయు
విరిసినది గోపాల! విమల నాదముతోని!

చిఱుచేప గంతులను జెదిరినా కొలనులా
నా మనసులో దొలికె నవభావములు నూ!

హరివిల్లు లోపలను నందాలు విరిసినటు
నా మనసులోగూడ నాథ! సొగసులు నూ!
ఏడురంగులతోని వేడుకను విరిసినవి
రామచిలుకకు వోలె రమణీయ ధ్వనులతో! ॥చిఱు॥

దూరాన సెలయేఱు పాటబాడిన రీతి
మావితోటను బాడు మధురకోకిల వోలె!
పసిపాప గంతులిడి పలుకు బలికిన యటుల
నా గొంతులో పాట నవనీత! విరిసినది! ॥చిఱు॥

సంధ్యకాంతులు విరిసి చల్లనీ మంచువులు
గరిక పూవులపైని గదలాడి నటులనూ!
నా పాటతో కలిపి నీ మురళి మ్రోయింపు
రా రమ్మ! గోపాల! రమణీయ రూపాన!

చిఱుచేప గంతులను జెదిరినా కొలనులా
నా మనసులో దొలికె నవభావములు నూ!

## పండినా వరిచేను

పండినా వరిచేను బన్నుగా వ్రాలినటు
నా మనసు వ్రాలినది నాథ! సొగసులనూ!

కొలను దామరపూపు గులికినటు నందాల
మధురభావాలతో మాధవా! మదినిండె!

పండినా వరిచేను బన్నుగా వ్రాలినటు
నా మనసు వ్రాలినది నాథ! సొగసులనూ!

మబ్బుచాటున నున్న మాధవా! చందురుని
కలువకన్నెయు జూచి కదలాడు రీతినీ!
నిను బిలుచుచుంటినీ నిర్మలంబగు గీతి!
పలుకు బలుకగరావ? పాలింపగా రావ? ॥పండినా॥

ఉదయ భాస్కరు కాంతి యుర్విపై బడునటుల
నీ దయా కిరణములు నిండుగా నాపైని
చిలకరింపగరాద! చిఱునవ్వు నవ్వుతూ,
అలకేల నాపైని యందాల శ్రీకృష్ణ! ॥పండినా॥

చిగురాకులను పూవు చిత్రముగ వెలయగా
మంచుబిందువు నిలిచి మధురిమలు జిందినటు
చిన్ని చిన్ని పదములను జిత్రమగు నొక గీతి
చిన్ని కోరికతోని చిత్రముగ వెలసినది!

పండినా వరిచేను బన్నుగా వ్రాలినటు
నా మనసు వ్రాలినది నాథ! సొగసులనూ!

## అలనాడు బాడినా!

అలనాడు బాడినా యాపాట నీపాట
మఱల బాడగలేను మాధవా! నేడూ!

అలనాటి భావాలు ఆనాటి శ్రుతిలయలు
మూగబడి పోయినవి మోదమును విడనాడి!

అలనాడు బాడినా యాపాట నీపాట
మఱల బాడుగలేను మాధవా! నేడూ!

గుండెలో నీపాట కొనలు మాసినవేమొ
భావాల పుట్టలో పాము జొరబడెనేమొ!
చెలువ మింతయులేక విలయమొందుచునుండె
సుకుమార నాదాలు స్రుక్కిపోవుచు నుండె! ॥అల॥

అడుగడుగడుగు నందునా యారాట మొందుచూ
కనులార్పకను బయలు గాంచుచుంటిని కృష్ణ!
నీ నిరీక్షణమందు నిలిచితిని గోపాల!
ఒకసారి యిటురమ్ము! వయ్యారి నడకలను! ॥అల॥

కనిపింతువని నేను కలలగాంచుచునుంటి
వినిపింతువని మురళి వీనులకు విందుగా!
కనిపించి వినిపించి కమ్మనీ రాగాన
రాగబంధముతోని లాగికొను బరమాత్మ!

అలనాడు బాడినా యాపాట నీపాట
మఱల బాడుగలేను మాధవా! నేడూ!

## అఖిల లోకమునందు!

అఖిల లోకమునందు నలరి యుండే స్వామి!
నను బ్రోవ వెందుకని? నాథ! శ్రీకృష్ణా!

అల గోపికకు వోలె యాడి పాడుచునుంటి
కనికరింపుమటంచు కాంక్షతో కృష్ణా!

అఖిల లోకమునందు నలరియుండే స్వామి!
నను బ్రోవ వెందుకని? నాథ! శ్రీకృష్ణా!

కిన్నెరను మీటుచును కీర్తనను బాడుచును
నిన్ను జగతిని వెదికి చిన్నబోతిని గదా!
మధుర మురళిని జేర్చి, మన్నించి నను దయను
భవబంధములనుండి బయటబడ వేయుమా? ॥అఖిల॥

చెల్లింపవేల నా చిన్ని కోరిక కృష్ణ?
త్రిప్పుచుంటివి నన్ను! దెలియవీ వీధులను!
పసిపాప వోలె నే బలవరించుచునుంటి!
కృష్ణ! కృష్ణా! యనుచు, కృతుల నే బాడుచును! ॥అఖిల॥

శ్రీమురళిలో నన్ను జేర్చుకొమ్మని గాద!
మధుర గోపికనంచు మాటి మాటికి దెలిపి,
కన్నీరు మున్నీరు కాలవలు గట్టగా
వన్నె గోపాల నే వలపు జిందుచునుంటి!

అఖిల లోకమునందు యలరి యుండే స్వామి!
నను బ్రోవ వెందుకని? నాథ శ్రీకృష్ణా!

# పరుగులెత్తుచు లేడి

పరుగులెత్తుచు లేడి పడిపోయినట్లుగా!
నిన్ను వెదుకుచు కృష్ణ! నే బడితి కోనలో!
గోరింక కోకిలలు గూర్మితో ననులేపి!
ఆదరించినవి నను నాత్మీయభావమున!

పరుగులెత్తుచు లేడి పడిపోయినట్లుగా
నిన్ను వెదుకుచు కృష్ణ! నే బడితి కోనలో!

గిరి పర్వతములపై గీతికల బాడుచును
అలసి పడిపోయితిని యటనున్న శిలలపై!
అంచబారులు వచ్చి యాదరించెను కృష్ణ!
ప్రేమతో నను లేపి ప్రీతి పలుకులు పలికి! ॥పరుగు॥

రాలినా పూలపై రమ్య గీతికలతో
పడిపోయితిని స్వామి! పారవశ్యముజెంది!
చిన్ని చిన్ని పిచ్చుకలు చిన్నారి తుమ్మెదలు
మధుర వచనంబులను మాటాడి లేపినవి! ॥పరుగు॥

నీ దర్శనము గోరి నే బరుగు లెత్తుచును
వనవీథులన్నియును వరుస దిరుగుచు నుంటి!
గరికపూవులుగూడ కరుణతో గాంచినవి
నీ మనసు గఱుగదే! నిండుదయ నొలుకుచును

పరుగులెత్తుచు లేడి పడిపోయినట్లుగా
నిన్ను వెదుకుచు! కృష్ణ! నే బడితి కోనలో!

## చిన్ని చిన్ని మాటలను!

చిన్నిచిన్ని మాటలను చిత్రమగు భావాల
పాట బాడగ నేను బరవశంబైతి!

నీ సొగసులను గూడి నిఖిల! నీ మురళినీ
కలిసిపోవాలనీ కాంక్షతో కృష్ణా!

చిన్నిచిన్ని మాటలను చిత్రమగు భావాల
పాటబాడగ నేను బరవశంబైతి!

చిన్ని చిన్ని తుమ్మెదల జేర్చి వాకిటియందు
తీయనీ రాగాల జేర్చితిని మదియందు!
పచ్చనీ చిలుకలను బరవశముగా బిలిచి
పలుకు నేర్చితి స్వామి పాట నే వ్రాయగా! ॥చిన్నిచిన్ని॥

వనివీధి నే బోయి వలనొప్ప కోకిలల
శుశ్రూష జేసి నే సోలిపోయితి నచట!
మధురగీతము నేర్పి మన్నించినవి నన్ను
బంచమ స్వరమునూ! బరగ నిచ్చినవీ! ॥చిన్నిచిన్ని॥

ఎన్నెన్నొ బాధలను నీ పాట నేర్చితిని!
మన్నింప వేల నను మాధవా! కరుణించి!
వెదుకుచుంటిని నిన్ను విమల! యెట నుంటివో
కనుల ముందర నిలిచి కనికరింపగరాద?

చిన్నిచిన్ని మాటలను చిత్రమగు భావాల
పాటబాడగ నేను బరవశంబైతి!

## ఆటపాటను నేర్చి!

ఆటపాటను నేర్చి యందాలు జిందగా
అల దుమ్మెదను జేరి యర్చించి నేనూ!

ఆట నేర్చితినమ్మ! పాట నేర్చితి చెలియ!
గోపాలబాలునీ కూర్మి నే నందగా!

ఆటపాటను నేర్చి యందాలు జిందగా
యల తుమ్మెదను జేరి యర్చించి నేనూ!

విప్పపువ్వుల రసము నింపుగా నే దెచ్చి
వారబోసితినమ్మ! వరుసగా కొన్నాళ్ళు!
రంగు రంగుల పూల రమణీయ పుష్పొడుల
వడ్డనల జేసితిని వరుసగా కొన్నాళ్ళు! ॥ఆటపాటను॥

మకరందముల నేను మధుపాత్రలను గూర్చి
అందించితిని చెలియ! యలరి నా జేతులను!
కొలనులో నున్నట్టి కూర్మి తామరపూల
మధుర గంధములతో మత్తు గలిగించితిని! ॥ఆటపాటను॥

ఇన్ని బాధలు నీకు నెందుకని బలికేవు
చిన్నిప్రశ్నను నన్ను జేరి యరుగకుమమ్మ!
మాధవుని కీర్తింప మధుర నృత్యము జేయ
ఇన్ని బాధలు నేను నింపుగా నందితిని!

ఆటపాటను నేర్చి యందాలు జిందగా
నల తుమ్మెదనుజేరి యర్చించి నేనూ!

## ఏ వూరు? ఏ పల్లె?

ఏ వూరు? యే పల్లె? యెట నీ నివాసమని
అరుగబోకండమ్మ! యలరి దెలుపనులే!

మాధవుని మది గోరి మమతలన్నియు విడిచి
ఇలువిడిచి వచ్చితిని! యింపుగా దాసినై!

ఏవూరు? యేపల్లె? యెట నీ నివాసమని
అడుగబోకండమ్మ! యలరి దెలుపనులే!

చిననాటి నుండియును జేర్చితిని స్నేహమును
చిన్నిగోపాలునీ శ్రీ మురళిలో గలియ!
పాటబాడుచు నేను ఐరగ నర్తించుచును
అలరి గోపాలునీ యందాలు మది దలచి! ॥చిననాటి॥

కిన్నెరను మీటుచును కీర్తనను బాడుచును
ఒక్కొక్క పల్లెనూ వనర దిరుగుచునుంటి!
వన వీధులన్నియును వరుస దిరుగుచునుంటి!
కొండకోనలయందు గోరి వీక్షించుచును! ॥చిననాటి॥

ఒటుభయంకరమైన పర్వతములను దాటి
సరితలను ధాటుదును సావధానములోని!
అడవి మైదానముల నటుల నే బోవుదును
చిన్ని కృష్ణుని గలియ! జిరునగవు దొలకగా!

ఏవూరు? యేపల్లె? యెట నీ నివాసమని
అడుగబోకండమ్మ! యలరి దెలుపనులే!

## నా ద్వారమున నిలిచి!

నా ద్వారమున నిలిచి నాట్యాలు జేసేవు!
పరవశించీ నాదు పాటలను వింటూ!

దరికి రావెందుకని? దయజూప వెందుకని?
మనసుదీరా కృష్ణ! మాటాడ వెందుకని?

నా ద్వారమున నిలిచి నాట్యాలు జేసేవు!
పరవశించీ నాదు పాటలను వింటూ!

చేజాచి యడుగలే! చిరభాగ్య భోగాలు
మహనీయమగు! నీదు మాణిక్య రత్నాలు!
తీయనీ నీ కరుణ తీరైన చూపునూ!
వాంఛించుచుంటినీ వన్నెలా గోపాల! ॥నా ద్వారమున॥

ఎన్నెన్నొ పాటలను వేడుకను బాడాను!
రాగాలతో కఠిన రాల కరిగించాను!
నింగితో దిరిగేటి నీలి మబ్బుల నేను
ఆనంద భాష్పాల యలరి రాల్పించాను! ॥నా ద్వారమున॥

వేలాది జన్మలిటు వేడుకను బోయినవి
నిన్ను బూజించుచును నిర్మలంబగు భక్తి!
నీ మనసు గఱుగదే! నిలువదే నామీద
నా పాటలో మాట నయముగా వినవేల?

నా ద్వారమున నిలిచి నాట్యాలు జేసేవు!
పరవశించీ నాదు పాటలను వింటూ?

## నా మనసులో నుండి

నా మనసులో నుండి న్నాట్యాలు జేసేవు
పాటవించూ కృష్ణ బరవశము జెందీ!

నిలిచి దాపున మధుర నిర్మలంబగు మురళి
పాట బాడవుగదా! పరవశంబగురీతి!

నా మనసులో నుండి నాట్యాలు జేసేవు!
పాట వింటూ కృష్ణ! పరవశము జెందీ!

కొండకోనల యందు గోరికను బాడేవు
సెలయేటి దరులందు జేరి యుండెద వెపుడు!
నీలిమబ్బుల యందు నిలిచినా తారలను
మధురమురళిని బాడి మన్నింతువేగాని! ॥నా మనసులో॥

గిరిసోన దాకిడికి జెదిరినా శిలలకును
రాలినా పూవులకు రమణీయ జివురులకు!
మబ్బు జివరల దొలుకు మణి చంద్ర కాంతులకు
ముద్దుగా బాడేవు! మోహనంబగు మురళి! ॥నామనసులో॥

ఆ కొండకోనలకు నలరి నే రాలేను!
కోటియందాలు నే కూరిమివి గనలేను!
నా ద్వారమున నిలిచి నవనీత పల్లవిని
పాడుమా! ఒకసారి బరవశించేటట్లు!

నా మనసులో నుండి నాట్యాలు జేసేవు
పాటవింటూ కృష్ణ! బరవశము జెందీ!

## బాలసూర్యుని ప్రభలు!

బాలసూర్యుని ప్రభలు బంగారు కాంతులను
దేలియాడుచు నుండె దీరుగా నుదయాద్రి!

పక్షి వలె గగనాన బిరుగు లెత్తాలనీ
రిక్కవలె పరమాత్మ! రెక్కలల్లార్చుతూ!

బాలసూర్యుని ప్రభలు బంగారు కాంతులను
దేలియాడుచు నుండె దీరుగా నుదయాద్రి!

కొండ కోనల దాటి, కోనేరులను దాటి
గిరి పర్వతములనూ దీరుగా నే దాటి!
మైదాన భూములను మానుగా నెగురుచును
అలమానసము జేర యాకాంక్ష గద స్వామి! ॥బాలసూర్యుని॥

సంద్రాన నే జేరి చక్కనీ తీరాన
అలలతో తెరలతో తరలివచ్చేటి యా
ముత్యాల కెంపులను ముదముతో నేరుకొని
అలరి మేయాలనీ యాకాంక్ష గద స్వామి! ॥బాలసూర్యుని॥

తాళ మృదంగాలు దగజేయు నురుగులుచు
ఇసుక దిన్నెల పైని యింపుగా గూర్చుండి!
మధుర కవితను కృష్ణ! మానసము బొంగునటు
ఆనంద వార్ధిలో నటుదేల నాకాంక్ష!

బాలసూర్యుని ప్రభలు బంగారు కాంతులను
దేలియాడుచు నుండె దీరుగా నుదయాద్రి!

## పాటబాడగ నీవు!

పాటబాడగ నీవు బరగ కిన్నెరనిచ్చి,
మాయమైపోతివి! మాటమంతీ లేక!

కిన్నెరను మ్రోగించి కణ్ణ! వెదుకుచు నుంటి!
చిన్ని పదములతో చిత్రముగ వీధులను!

పాట బాడగ నీవు బరగ కిన్నెరనిచ్చి
మాయమై పోతివి! మాటమంతీ లేక!

మనసులో భావాలు మల్లియల మాలగా
నీరూపు రేఖలను నీ యంద చందాలు!
నలుగురికి దెలుపుతూ నాల్గువీధుల యందు
జాడలడుగుచు నుంటి నీడలో గూర్చుండి! ॥పాట॥

అడవులను దిరుగుచును నట లేడిపిల్లలను
కోనేరు లందుగల కూర్మి తామరపూల!
దారిలో దగిలినా తంగేడు పూవులను
అడుగుచుంటిని కృష్ణ! యలరి నీ జాడలను! ॥పాట॥

కిలకిలా బలికేటి కిన్నెరను నడిగితిని!
ఎవరు నీ వనుచు మఱి యేపల్లె నీదనుచు!
అస్పష్టముగ బలికె యా కిన్నెరయు గూడ
'నేను మాధవుడనూ! నీవు నా దాసివీ!
నీ చేతిలో నేను నిలచియున్నా' ననుచు!

పాటబాడగ నాకు బరగ కిన్నెర నిచ్చి
మాయమై పోతివి! మాటమంతీ లేక!

## మతి చలించిన దోయి!

మతి చలించిన దోయి మర్మముగ శ్రీకృష్ణ!
పెనుగాలికిని గదులు పెరటి యఱటాకులా!

కదలాడుచున్నదీ కాంక్షతో శ్రీకృష్ణ!
మాలతీ లతవోలె మఱి కదులుచున్నదీ!

మతి చలించినదోయి! మర్మముగ శ్రీకృష్ణ!
పెనుగాలికిని గదులు పెరటి యఱటాకులా!

వనవీధి యందుగల వన్నెలా పూలతల
వికసించినా పూల విమలతల విడనాడి,
రాలినా పూల నే రమణ దోసిలి తోని
పూజకై తెచ్చితిని పురుషోత్తమా నీకు! ॥మతి॥

అలలతో తెరలతో నాడేటి సంద్రాన
ముత్యాల ప్రోవులను ముదముతో నే నొదిలి
చిన్ని చిన్ని గవ్వలను జేర్చి నా యొడినిండ
కానుకల నిచ్చుటకు కదిలి వచ్చితినోయి! ॥మతి॥

రంగురంగుల సంధ్య రమణీయ మొలకలను
ప్రోవుజేయక నీదు పూజకై శ్రీకృష్ణ!
రాత్రి చీకటిలోని రంజిల్లు గాటుకల
అలరి దెచ్చితి నీదు నర్చనల కొఱకునూ! ॥మతి॥

పాడేటి పాటలో పల్లవిని గూర్పకను
శ్రుతిలయలు లేకుండ చోద్యముగ బాడుచూ!
కొండపైనుండి ధర బండదొరలిన యటుల
గతి తప్పియున్నదోయ్! మతిలేని నాపాట! ॥మతి॥

## పంజరములో చిలుక!

పంజరములో చిలుక పలుగ పెనుభూతమై
వేధించుచుండె నను విచ్చు కత్తులనూ!

అడుగడుగునందునను హరినామమును దలచి
అగ్నిజ్వాలల రేపి యానంద మొందునే!

పంజరములో చిలుక పలుగ పెనుభూతమై
వేధించుచుండెనే విచ్చు కత్తులనూ!

నిదుర లేచిన మొదలు నిదురించు వఱకు చెలి!
మాధవా! గోవింద! మఱి యచ్యుతా! యనుచు!
నా విభుని నామముల నయముగా బలుకునే!
మధుర స్మృతులను దెచ్చిమదికోత గోయునే! ॥పంజరములో॥

మాటాడబోకుమని మాధవుని బేరనుచు
యచ్యుతా! యనుచు మఱి యలరి బలుకకు మనుచు
కట్టడిని జేసితిని! కఱకుగుండెల చిలుక
నావిభుని నామముల నయముగా బలుకునే! ॥పంజరములో॥

గుండెబరువున నేను కుమిలిపోతుండగను
కాంతు విరహముతోని కలగుండు బడుచుండ!
మఱల బలుకును చిలుక మాధవుని నామముల
మార్చివేయును నన్ను మఱి చంద్రనిప్పులను! ॥పంజ॥

వనమునందున దీని వదిలిరావే చెలియ!
ఫలవృక్షములయందు బడవేసి రాగదే!
దూరాన గోదారి తీరమున పూతోట
చిలుక గుంపుల యందు జేర్చి రావే! చెలియ! ॥పంజ॥

## చిఱునవ్వుతో నన్ను!

చిఱునవ్వుతో నన్ను జేరబిలిచే దాక
మాటాడనే చెలి! మాధవునితోని!

మౌనమూనుదును నే మాటాడిననుగూడ
పలుకనే ఓ చెలియ! బరవశం బగుచునూ!

చిఱునవ్వుతో నన్ను జేరబిలిచేదాక
మాటాడనే చెలి! మాధవునితోనె!

కనులార్పకను నేను గాంచితిని! వేదనను
దూరాన వనరేఖ చూడ్కి యందేదాక!
గిరిశిఖరములనెక్కి కీర్తనల బాడుచును
అడలుచును బిలిచితిని యాచిన్నిగోపాలు! ॥చిఱునవ్వుతో॥

విరహవేదన యంత విప్పిజెప్పితినమ్మ!
ఎడబాటు గూడదని నింపుగా దెలిపితిని!
నిను విడిచి క్షణమైన నే నుండజాలనని
యలరిజెప్పితి నమ్మ! యార్తితో గీతమున! ॥చిఱునవ్వుతో॥

ఎన్నిజెప్పినగాని విన్నపము వినడుగద!
కన్నెనగు గోపికను గలతబొందించెగద!
స్వయముగా మురళితో జేరవచ్చిన గాని
చిన్నిబలుకును బలికి జిఱునవ్వు జిందనే!

చిఱునవ్వుతో నన్ను జేరబిలిచే దాక
మాటాడనే చెలి! మాధవునితోని!

## కోకిలా పాడవే!

కోకిలా! పాడవే! గోవింద నామముల
మాధవుని స్మృతులతో మధురజ్వాలలు రేపి!
క్రొత్త చివురులు దెచ్చి కూర్మివిందులు జే
నల్లకలవలతోని నయముగా బూజింతు!
కోకిలా! పాడవే! గోవింద నామముల
మాధవుని స్మృతులతో మధురజ్వాలలు రేపి!

హరినామముల నీవు యాలపించుచునుండ
ఆరాట మొందుదును నలమటింతును జెలియ!
గిరిశిఖములనుండి జారేటి సోనలా
కన్నీటి నొలుకుదును! గతిగిపోదును సఖి! ॥కోకిలా॥

పచ్చనీ చిలుకచే బంగారు హారమును
మధు ధారలిప్పింతు మఱి తుమ్మెదలజేత!
మల్లెమాలతులతో మర్యాద జేయింతు
కాశ్మీరముననుండు కనకాంబరము లిత్తు! ॥కోకిలా॥

ఏ కాననలకునైన మెగిరిపో కోకిలా!
పాడబోకింక మఱి పద్మనాభుని గీతి!
నా కంఠహారమును నయముగా నీ కిత్తు!
నారాయణుని పాట నాయెదుట బాడవే!

కోకిలా! బాడవే గోవింద నామమును
మాధవుని స్మృతులతో మధుర జ్వాలాలు రేపి!

## నీపాట దెలియుతే

నీపాట దెలియుతే! నీయాట దెలియుతే!
నీజాడ లన్నియును నెఱి నాకు దెలియ్యూ!

మోసగింపకు నన్ను మోదమున బడద్రోసి
పాఱిపోయిన గాని బంధింతు శ్రీకృష్ణ!

నీపాట దెలియుతే! నీయాట దెలియుతే!
నీజాడలన్నియును నెఱి నాకు దెలియ్యూ!

చిఱునవ్వులను జిందు జిన్నారి సంధ్యలను
నాడుకొనుచుందువని యలరి దెలియును నాకు!
చిగురులను దాగినా చిట్టిపూవుల తోని
రాగాలు దీతువని రమ్యముగ తెలియుసూ! ॥నీపాట॥

నీలి మబ్బులయందు నిలిచినా తారకల
తళుకు బెళుకుల యందు పగ గులుకు చుందువని!
గరిక పూవులపైని గపలాడు మంచువుల
యలరు చుందుటకూడ యది నాకు దెలియుతే! ॥నీపాట॥

పిలువనీ వారలను ప్రేమతో జూచెదవు!
మదికింపు గూర్చెదవు మాధవా! దయతోని!
బ్రతుకంత నిను బాడి బరవశించే నన్ను
కనుగొనల గాంచవూ! కరుణ యింతయు లేక!

నీపాట దెలియుతే! నీయాట దెలియుతే!
నీ జాడలన్నియును నెఱి నాకు దెలియుతే!

## నల్లనీ తుమ్మెదా!

నల్లనీ తుమ్మెదా! నాట్యాలు జేయుచును
కనిపింపకే నాకు కనికరముతోనీ!

కఱకుగుండియలుగల కారుణ్యమూర్తినీ
పొడకే నా యెదుట! బరవశంబగునటుల!

నల్లనీ తుమ్మెదా! నాట్యాలు జేయుచును
కనిపింపకే నాకు కనికరముతోనీ!

పరమపావనుని నే పాడి యాడితినమ్మ!
తీయనీ పాటలను దేనెలను గురిపించి!
దయలేని విభుని నే దలచి దలచీ నేను
మౌనమూనితి చెలీ! మనసు రాయిని జేసి! ॥నల్ల

నల్లనీ రూపాన నాయెదుట కనిపించి
నా విభుని రూపమును నయముగా మదియందు!
భాసింప జేసెదవు! భ్రమజెందుదును మదిని
కలత జెందుదునమ్మ! కారుణ్యమూర్తి వని! ॥నల్లనీ

వెడలిపో తుమ్మెదా! వినువీధులకు వేగ
వనవీధులకునైన వనర కోనలకైన!
కలువ తామరలుండు కమ్మనీ తావులకు
విభుని స్మృతులను దెచ్చి వేధింపబోకమ్మ!

నల్లనీ తుమ్మెదా! నాట్యాలు జేయుచును
కనిపింపకే నాకు కనికరము తోనీ!

## కలహంస బలుకకే!

కలహంస బలుకకే! కమనీయ కవితలను
చిన్నికష్ణుని గూర్చి చిఱునగవు జిందీ!
చిన్నిగోపాలుడే జేర రావచ్చుగద!
మతిలేనిదాన! విను! మధ్య నీ వెందుకే!
కలహంస బలుకకే! కమనీయ కవితలను
చిన్నికృష్ణుని గూర్చి చిఱునవ్వు జిందకే!

అలరి నీ కవితలను నాలాపనము జేసి
నీతివాక్యములతో నీరసము జేయకే!
వన్నెలా నడకలను వగలాడి చేష్టలను
నన్ను మోసముజేసి నవనీతు జేర్పకే! ॥కలహంస॥

ఆటపాటల నేను నలరించినానమ్మ!
మధురభావాలతో మతి కలిపినానమ్మ!
ఆదుకొనడేల నను నమృత హస్తాలతో
స్వీకరింపడు నన్ను చిఱునగవు జిందుచును! ॥కలహంస॥

కాపురం బెటులనే కలికి! నీవే దెలుపు!
మాటమంతీ లేక మౌనమూనినవాని!
ఆతడే స్వయముగా నలరుచును నిటువచ్చి,
స్వీకరింపు మటంచు చెలువ! వే దెలుపవే!

కలహంస బలుకకే కమనీయ కవితలను
చిన్నికృష్ణుని గూర్చి చిఱునగవు జిందీ!

## బాట మఱచితినోయి!

బాట మఱచితినోయి! బిన్నుగా గోపాల!
నా కుటీరమునకును నను జేర్పవోయీ!

తిరుగుచుంటిని నేను దీరుగా కానలను
కొండకోనలయందు గూర్మి దిరుగుచునూ!

బాట మఱచితినోయి! బిన్నుగా గోపాల!
నా కుటీరమునకును నను జేర్పవోయీ!

మంచుపొగ గమ్మినది మాధవా! జగమంత!
నా కుటీరము నేను నయముగా గనలేను!
దారిజూపుము కృష్ణ! దయజూపి కరుణతో
బాట వే గనబఱచి పడతి యార్తిని బాపు!

నదియందు బయనించు నా నావ గోపాల!
గమ్య మన్నదిలేదు! కదిలిపోవుచునుండె!
దరిజేర్పవోయి! నను దాసిగా భావించి
బాట వే గనబఱచి పడతి యార్తిని బాపు!

పూవులను జివురులను బుష్పించియున్న నా
మల్లెపందిరికి వే మాధవా! దరిజేర్పు!
మధురమౌ నీ భక్తి మాధుర్యముల నిమ్ము
నీ వేణు ధ్వనులలో నిలుపుకొను గోపాల!

బాట మఱచితినోయి! బిన్నుగా గోపాల!
నా కుటీరంబునకు నను జేర్పవోయీ!

# ముద్దు గోపాలు నే!

ముద్దు గోపాలు నే మురిపమున గనుచుందు
హరిగీత మొక్కటే యలరి వినుచుందూ!

సర్వమును మఱచితిని! సఖియ! నే లోకమున
సరస సాహిత్యాలు సంగీత నాదాలు!

ముద్దు గోపాలు నే మురిపెమున గనుచుందు!
హరిగీత మొక్కటే యలరి వినుచుందూ!

విమల గాథలు నేను వినిపించుకోలేను
రమణీయ గీతాల నాదాలు వినలేను!
అందాల వెన్నెలల యాటలాడగ లేను
కోకిలను నే గలిసి కూడి పాడగలేను! ॥ముద్దు॥

సమయమింతయులేదు సాహిత్య చర్చలకు
కమ్మనీ ప్రకృతిని గలిసి జూడగలేను!
కను రెప్పపాటునూ కాంత సమయములేదు!
నలరి నా మనసేమొ యతని గాంచుచు నుండు! ॥ముద్దు॥

పయన మెచ్చటి కనుచు బడతి నన్నడుగకే!
తారవలె గగనాన తరలి పోవుచునుంటి!
మెఱుపులా మబ్బులో మెఱయుచుంటిని సఖీ!
మంచు ముత్తెము వోలె మాయమౌ బోదునూ!

ముద్దు గోపాలు నే మురిపెమున గనుచుందు!
హరిగీత మొక్కటే యలరి వినుచుందూ!

## నే మఱచిపోతినీ!

నే మఱచిపోతినీ నిఖిల లోకంబునూ
హరి పాద పద్మముల నాత్మలో దలచీ!

ప్రొద్దెపుడు పొడుచునో, పొద్దెపుడు గ్రుంకునో
పొలుపుగా మఱచితిని! పొలతిరో! వినుమా!

నే మఱచిపోతినీ నిఖిల లోకంబునూ
హరి పాద పద్మముల నాత్మలో దలచీ!

తొలిసంధ్య నే గాంచి మలిసంధ్య యనుకొందు
రాత్రిబవళులు గూడ రమణి! దెలియగలేను!
అన్నపానాదులను నలరి మఱచితినమ్మ!
నీరజాక్షుని దలచి నిదుర నే మఱచితిని! ॥నే మఱచి॥

వన్నెలా పువ్వులూ చిన్నెలూ విరిసేటి,
వాసంతమును నేను వనిత గుర్తింపనూ!
మంచు కురిసేటి శ్రీ మధుర హేమంతమును
గుర్తింపలేనమ్మ గూర్కి యెపుడొచ్చునో! ॥నే మఱచి॥

పాటతో గగనాన పరుగులెత్తుచునుంటి
గీతితో తారలను మతి గలుపుచునునుంటి,
క్రింది భూమియు దెలియు పైని యాకాశంబు
మనసులో నాకు మఱి మాధవుడు గనిపించు!

నే మఱచిపోతినీ, నిఖిల లోకంబునూ
హరి పాద పద్మముల నాత్మలో దలచీ!

## వినిపించుచున్నవీ!

వినిపించుచున్నవీ వీనులకు విందుగా!
పిల్లనాగ్రోవి యా పిలుపు లెటనుండో!

అవని యంబరములను అన్నివైపులనుండి
ఆ ధ్వనులు వినిపించు నమలమగు శ్రుతిలయల

వినిపించుచున్నవీ వీనులకు విందుగా
పిల్లనాగ్రోవి యా పిలుపు లెటనుండో!

మై మఱచిపోతినీ మైకమున మునిగితిని!
పరవశంబైపోతి పడిలేచు దరగలా!
ఎటుబోదు? నెటుజూతు? నింపుగా మాధవుని
అంతటా నిండినా యా చిద్విలాసునీ! ॥వినిపించు॥

కనుల ముందఱ నిలిచి కనిపించినటులుండు
వినిపించి నటులుండు విమలమగు మురళినీ,
చిఱునవ్వుతో దయను జేర్చుకొని శ్రీమురళి
శిరమునను నుంచినటు జిరశాంతి దేల్చినటు! ॥వినిపించు॥

కల నిజము సేయుమా! కల్యాణ గుణధామ!
మనసులో నున్న నా మధురమగు గోరికను!
పిల్లనాగ్రోవి యా పిలుపులను నను జేర్చి
జ్యోతిలో గలుపుకొని ప్రీతి సేయుము స్వామి!

వినిపించుచున్నదీ వీనులకు విందుగా
పిల్లనాగ్రోవి యా పిలుపు లెటనుండో!

## పాడినా పాటనే!

పాడినా పాటనే పాడుచుంటిని స్వామి!
పిలిచినా పిలుపుతే పిలుచుచుంటినిగా!

ౘ్రుతిలయలు చెడకుండ సుందరంబగు గీతి
మధురభావాలతో మాధుర్యములు విరియ!

పాడినా పాటనే పాడుచుంటిని స్వామి!
పిలిచినా పిలుపుతే పిలుచుచుంటినిగా!

మావికొమ్మలపైని మధురముగ గొంతెత్తి
కోకిలలు కూ యనుచు కొసరి పాడినయటుల!
చిలుక పలికిన రీతి చిత్రముగ వనవీధి
తీయనీ పలుకులను దేనె లొలికిన రీతి! ॥పాడినా॥

క్రొత్త పాటలు రావు! కోరికలు మది లేవు!
నీ రూపమేకాని నిలువదొక ప్రతిరూపు!
ప్రకృతి పాడినయటుల పాత పాటల నెపుడు
క్రొత్త రూపాలతో గోర్కి పాడుచునుందు! ॥పాడినా॥

క్రొత్తవాడవుగావు! గోపాల నే గూడ
ప్రాతవారము సుమా! పదికాలములనాటి!
నా వాడవని నిన్ను నయముగా పిలిచెదను!
మదిని ప్రేమలు విరియ మాధవా! నీ కొఱకు!

పాడినా పాటనే పాడుచుంటిని స్వామి!
పిలిచినా పిలుపుతే పిలుచుచుంటినిగా!

## పాట బాడుటకు గద!

పాట బాడుటకు గద! ఐరగ నను బుట్టించి
అందాల కిన్నెరను నందించితివి స్వామి!

పరమ పావనమైన భక్తి మఱి దయజేసి
వలపు నిలిపితివి నా వయ్యారి పాటపై!

పాట బాడుటకు గద! ఐరగ నను బుట్టించి
అందాల కిన్నెరను నందించితివి స్వామి!

నల్లనీ మేఘాలు నల్లుకొన గగనాన
మెఱుపు దీవెలు మెఱసి యుఱుము లుఱిమినయపుడు
ననుబాడ మనియెదవు నళినాక్ష! గీతికను!
ఐటు శరము వేగాన! పణి యాడినట్టులను! ॥పాట॥

చిగురుటాకులు పూలు చిత్రముగ విరబూయ
వాసంత ఋతువులో వన్నెలవి జిందగా!
పుంస్కోకిలకు జతగ బూని బాడుమటంచు
అందించెదవు నాకు నలరు పాటకు మొదలు! ॥పాట॥

చంద్రకాంతులు విరియు సాంద్రమగు వెన్నెలల
కలువ పద్మములలో గాంతులూరే వేళ!
ఆ శరత్కాలాన అందాల వీణతో
నాలపింపు మటంచు నందాలు జిందేవు! ॥పాట॥

అటుల నే నే బాడి యాలపించితి స్వామి
నీవు దెలిపిన రీతి నిఖిలేశ! గీతికల!
ఆడితిని! బాడితిని! యందాలు జిందితిని!
నిర్దయా! యికనైన నీయందు గలుపుకొను! ॥పాట॥

## విభు డంపినా లేఖ!

విభు డంపినా లేఖ! విశదముగ బరికించి
వినిపింపవే చెలీ! వికసింప మనసూ!

చిలుక బలికిన యటుల సింగార మొలికించి
ఒక్కొక్క పలుకునూ వరుసగా బలుకవే!

డంపినా లేఖ! విశదముగ బరికించి
పింపవే చెలీ! వికసింప మనసూ!

మనసులో నచ్యుతుడు మధురిమలు నొలికెనా,
తీయనీ పదములను దీర్చెనా లేఖలో!
'దాసి' యని నను బిలిచి దయజూపెనా విభుడు,
మమతతో నాప్రేమ మన్నించినాడా? ॥విభు॥

జ్యోతిలో నను గలిపి ప్రీతిసేయుదునంచు
మాటయిన వ్రాసెనా? మఱివేగ తెలుపుమా!
తాపమాపగ లేను! తరుణి వే వివరింపు!
మాధవుని మనసులో మర్మమగు భావమును! ॥విభు॥

మురళిలో గలిపి నను మోదమున దేల్తునని
చిరశాంతి నిత్తునని జేరదీయుదు ననుచు!
మాటయినా వ్రాసెనా? మఱిలేద? సఖియరో!
మధురమగు వాక్యముల మానినీ దెలుపవే!

విభు డింపినా లేఖ విశదముగ దెలుపవే!
వివరింపవే సఖీ! వికసింప మనసూ!

## మనసులో నీ పాట!

మనసులోని పాట మణిగుండ లేదే!
పాలపొంగుకు మల్లె బడిలేచు దూకీ!

ఆపినా యాగదే! అందాల రాగాల
చిన్నారి పదములను జిందు పూమాలగా!

మనసులోనీ పాట మణిగుండ లేదే!
పాలపొంగుకు మల్లె బడిలేచు దూకీ!

భావాల నల్లుకొను బరిమళము వికసింప
చిన చిన్ని పదములను సింగారముల తోని,
రాజనర్తకి వోలె రమణీయ గీతిగా
గొంతులోపల నుండి కొస కలముపై వ్రాలు! ॥మనసులో॥

'బాలకృష్ణా!' యనుచు బలుకగా నోరార
పాటగా రూపొందు బరిమళము జిందగా!
ఏ గాథ బంధమో! యే చిత్ర స్నేహమో!
సెలయేటి తరగలా బిలబిలా ప్రవహించు ॥మనసులో॥

కనుల నిద్దుర రాదు! కలత నలతల జేయు
అందాల గురిపించు! ఆటలాడించు నను!
మదిలోని నా పాట మధుర వేదనలతో
బాలెంత నను జేసి బాధగలిగించునే!

మనసులోనీ పాట మణిగుండ లేదే!
పాలపొంగుకు మల్లె బడి లేచు దూకీ!

## మనసుననును నిను దలచి!

మనసుననును నిను దలచి మధుర గీతముతోని
పాడుచును జూచెదను బరగ నీ దారి!

జన్మజన్మలు నిటుల జరుగుచూ బోయినా
నీ నిరీక్షణముననును నిలిచి యుండెదనూ!

మనసుననును నిను దలచి మధుర గీతముతోని
పాడుచును జూచెదను బరగ నీ దారి!

నీ నామమును మదిని నిరతమును భక్తితో
జపియించు చుంటినీ జన్మ జన్మల నుండి!
నా బంధముల విడిచి నను జేర్చుకొందువని
ఆశించుచుంటినీ యనవరతమును నేను! ॥మనసుననును॥

ఎన్నెన్నొ వినతులను నేకాంతమున నేను
భక్తి జేసితిగదా! పరము నే నాశించి!
నీ పాద కమలముల నెఱనమ్మితిని గదా!
అన్ని నీవని నమ్మి యర్చించితిని స్వామి! ॥మనసుననును॥

కంటినీరొలుకుచును గారుణ్య దీపముగ
వీధులన్నియు దిరిగి వెదికితిని శ్రీకృష్ణ!
నీ నిరీక్షణముననును నే విరహకాంతనై
తపయించుచుంటి నిట తరగనీ మమతతో!

మనసుననును నిను దలచి మధురగీతముతోని
పాడుచును జూచెదను బరగ నీదారి!

## చిగురుచాటున పువ్వు!

చిగురుచాటున పువ్వు చిత్రముగ దాగినటు
నా మనసులో నుండి నాట్య మాడేవూ!
    కంటి కగుపింపకను కమనీయ రూపాల
    అల్లిబిల్లిగ దిరిగి యాడుకొందువదేల?
చిగురుచాటున పువ్వు చిత్రముగ దాగినటు
నా మనసులో నుండి నాట్యమాడేవు!

మబ్బులో జలధార మాటుమణిగిన యటుల
తీయనీ రాగాల తేనె లొలికేవూ!
పూవులో దావిలా పులకలను జిందుతూ
మధుర నాదాలతో మదిని మరిపించేవు! ॥చిగురు॥

వీణలో రాగాలు విప్పారుచుండునటు
పాటలో భావాలు పరిమళించే టటుల
కవితలో కమనీయ కథ దాగి యుండునటు
తీపాలతో మదిని దీప్తి గావించేవు! ॥చిగురు॥

మదిని పులకించుచును మమతలను పెంచుచును
మోహమున ముంచి యిటు మోదమున దేల్చేవు
కనుల ముందున నిలిచి కమనీయ రూపాన
మది నన్ను జేర్చుకొను మమత పొంగేటట్లు!

చిగురుచాటున పూవు చిత్రముగ దాగినటు
నా మనసులో నుండి నాట్యాలు జేసేవు!

## కమనీయ మురళిలో!

కమనీయ మురళిలో గలుపుకొను శ్రీకృష్ణ!
కమ్మనీ పాటగా గథవోలె మిగులనీ!

విశ్వగీతములోని విమలమగు శ్రుతిలయల
నన్నొక్క స్వనముగా నాథ గావింపుమా!

కమనీయ మురళిలో గలుపుకొను శ్రీకృష్ణ!
కమ్మనీపాటగా గథవోలె మిగులనీ!

సన్నగా వీచేటి సవ్వడుల జిఱుగాలి
వెన్నెలల వానలో వికసించు గలువగా!
అందాల కొలనులో నాడుచును శ్రుతిలయల
ముంచు తుంపురులలో మాయమగునటు జేయి! ॥కమనీయ॥

అందాల హరివిల్లు నలరునటు గగనాన
నీ యందు గలిసినటు నిర్మలంబైనటుల
వికసించి దీపెలను వెదజల్లి పరిమళము
పుడమిపై వ్రాలినటు పువ్వుగా నను జేయి! ॥కమనీయ॥

పుడమిపై వ్రాలినా! భూతిలో గలిసినా
కఱకు కత్తుల నడుమ కథ నే ముగించినా!
నీ మురళి శ్రుతిలయల నే గలియవలెనోయి!
నీ ధర్మపథమునను నే నడువగా వలయు!

కమ్మనీ మురళిలో గలుపుకొను శ్రీకృష్ణ!
కమ్మనీ పాటగా గథవోలె మిగులనీ!

## అందు కేతే!

అందు కేతే! అందు కేతే!
అలరి నే నిటు గీతిబాడుట!

అందు కేతే! అందు కేతే!
అలరి నే నిటు నాట్యమాడుట!

మాధవునకును జేరువగుటకు
మధుర మురళిని లీనమగుటకు! ॥అందు కేతే॥

కవిత నేర్చుట కవనమల్లుట,
తీపి పదముల దీర్చి పేర్చుట,
మధురగీతము మాధవునిపై
భక్తిపాడుట బరవశమునై! ॥అందు కేతే॥

నెమ్మి నర్తన లన్ని నేర్చుట!
నేర్పుతో నర్తకిని యగుటయు!
విభుని జేరుటకే గదా యీ
విధములన్నియు నేర్పుకుంటిని! ॥అందు కేతే॥

రాసక్రీడలు సలుపువాడట!
రమ్యమైనా గీతములతో!
గోపకాంతల గోర్కెదీర్చె
కోమలుండట చిన్ని కృష్ణుడు! ॥అందు కేతే॥

అందు కేతే ఆటపాటల
అందములనూ నేర్చుకుంటిని!

జ్యోతి జ్యోతిని గలుపుటకునై
కాంతిలో నే లీనమగుటకు! ॥అందు కేతే॥

# కన్నీరు వరదలై

కన్నీరు వరదలై కాలువగ మారినా
కరుణ నాపై రాదు కారుణ్య మూర్తీ!

పిలిచి పిలిచీ నాదు వలపు గీతము గూడ
మౌనమూనిసదోయి మల్లెమొగ్గకు మల్లె!

కన్నీరు వరదలై కాలువగ మారినా
కరుణ నాపై రాదు కారుణ్యమూర్తీ!

తీయనీ భావాల తీపిమాటల తోని
జతగూర్చి పాడితిని వెత నందితిని చాల
రావుగద! నాదరికి రమణీయ రాగాల
మురళి మ్రోయించును మోదమును జిందుచునూ ॥కన్నీరు॥

శ్రుతిలయలు తప్పినవి! చోద్యముగ నాపాట
అందాల రాగాల నాలపించుట మానె!
గొంతెత్తి పాడగా గోరికయు నశియించె
మంజులంబగు స్వనము మాసిపోయినదోయి! ॥కన్నీరు॥

నల్లరాతికి మల్లె నామనసు మారినది
కటికచీకటి తెరల కదిలిపోవుచునుంటె!
ఇకనైన వే రమ్మ! నింపుగా వెతదీర్ప
అందాల మురళితో నాడుతూ పాడుతూ!

కన్నీరు వరదలై కాలువగ మారినా
కరుణ నాపై రాదు! కారుణ్యమూర్తీ!

## మధుమాస మిది స్వామి!

మధుమాస మిది స్వామి! మానసము జిగురించి
పూలుబూయుచు నుండె బుహ్వాడులు జిందీ!

సన్నని సెలయేరు జిన్నిజాలుకుమల్లె
సుకుమార భావాలు సుడులు దిరుగుచు నుండె!

మధుమాస మిది స్వామి! మానసము జిగురించి
పూలు బూయుచునుండె బుహ్వాడులు జిందీ!

నీపైని వలపు లవి నిండారు గౌతమిగ
యలలవలె దెరలవలె నలరుచుండెను మదిని!
కన్నార నను గాంచి గారవింపగరాద!
విన్నపము వినరాద! వేడుకను నొకసారి! ॥మధుమాస॥

వనవీథి యంతటను వన్నె లొలుకుచునుండె
రంగు రంగులపూలు రమణీయములు విరిసె!
మకరందములు గ్రోలి మధుపములు జెలరేగె!
కోకిలమ్మలు బాడె కోన కోనలయందు! ॥మధుమాస॥

నా గొంతులో మధుర రాగాలు వికసించి
గీతిగా బుష్పించి కిలకిలా నవ్వుచును!
నీవేణు నాదాల నిలువ గోరుచునుండె!
ఆకాశమార్గాన యరుగుచున్నది కృష్ణ!

మధుమాసమిదిస్వామి మానసము జిగురించి
పూలు బూయుచు నుండె పుహ్వాడులు జిందీ!

## నా జీవ కుసుమమును

నా జీవ కుసుమమును నాథ! గైకొనుమోయి!
వికసించితిని స్వామి! విమల గంధములా!
నేల రాలకముందు నిగ్గు బాయక ముందు
కరుణతో గైకొనుము! కమ్మనీ పూజకై !!
నా జీవ కుసుమమును నాథ! గైకొనుమోయి!
వికసించితిని స్వామి! విమల గంధములా!

తుమ్మెదలు జుమ్మనుచు దూలియాడకముందు
మకరందములు జారి మాయమై పోకమును!
విశ్వ సౌందర్యమును వెలయించు శ్రీమురళి
ధరియించు కరముతో భరియింపు ప్రీతితో! ॥నా జీవ॥

అందాలు గోల్పోయి కందిపోవక ముందు!
తొడిమ యాడకముందు దూలి రాలక ముందు!
చిరుగాలి తరగలను దేలగా బరిమళము
అంతరింపకముందు నాదుకొను బరమాత్మ! ॥నా జీవ॥

ఆర్తులను గాపాడి యాదరించేవాడ!
చినిగినా బ్రతుకులను సేదదీర్చేవాడ!
మురళి పూజకు నేను మోదమునయుంటినీ
నా వినతి యాలించి నాకోర్కె దీర్చుమా!

నా జీవ కుసుమమును నాథ! గైకొనుమోయి!
వికసించితిని స్వామి! విమల గంధములా!

## మావికొమ్మల పైని!

మావి కొమ్మలపైని మాలతీ లతలలో
పాడేటి కోకిలా పాట నిక నాపూ!

వాసంత గీతమును వన్నె లొలుకగ బాడి
నా మనసు నింపకే నవభావములతోని!

మావికొమ్మలపైని మాలతీలతలలో
పాడేటి కోకిలా పాట నిక నాపూ!

సంధ్యారుణ ప్రభలు సరసముగ దూర్పునా
కుంకుమలు విరజిమ్మె కుందనపు కాంతులను!
నా మనసు పొరలలో నా జీవితేశ్వరుడు
కమ్మనీ మురళితో గనిపించుచున్నాడు! ॥మావి॥

మురళి బాడినయటుల ముద్దులొలికిన యటుల
జిరుగజ్జియలతోని జిందినటు లాస్యమును!
నను జేరబిలిచినటు నవజ్యోతిజూపినటు!
తేలిపోవుచునుండె తెరలలో కలలలో! ॥మావి॥

చిగురు చిగురున విరిసె చిన్నారి మిసమిసలు!
పూవు పూవున విరిసె బులకించు బరిమళము!
నీగీతి మధురిమలు నిఖిలేశు నా విభుని
విరహమును బెంచకే! వేదనను గలిగింప!

మావి కొమ్మలపైని మాధవీ లతలలో
పాడేటి కోకిలా! పాట నిక నాపూ!

## మధురమౌ శ్రీమురళీ!

మధురమౌ శ్రీమురళీ మాధుర్య మెట్టిదో!
ఆనంద సుధలలో నటు దేలిపోతాను!

ఏరాగ తాళాల యెటు బాడెదోగాని
మనసంత శ్రుతిలయల మాధుర్యమునదే

మధురమౌ శ్రీమురళీ మాధుర్యమెట్టిదో
ఆనందసుధలలో నటు దేలిపోతాను!

ప్రకృతి యందాలన్ని బరువెత్తి వచ్చినటు
నీమురళీ గానాన నిలిచినటు గొంతెత్తి!
కలిసి పాడినయటుల కమ్మనీ గాత్రాన
సామగానము రీతి సరిగమల నొలుకుచును!

పాములా బడగెత్తి బరవశంబై పోయి
కదలకను మెదలకను గాంచెదను నీ మురళీ!
నాహృదయ మంతయును నవకాంతి పుంజాలు
లక్షదీపాలతో రంజిలును కోవెలగ!

కలిసిపోవాలనీ కమనీయ మురళిలో
నిలిచిపోవాలనీ నీడలో నీ మురళీ!
నీ వేణునాదమున నే నొక్క స్వనమునై
అణిగిపోవాలనే యావేదనను దీర్చు!

మధురమౌ శ్రీమురళీ మాధుర్యమెట్టిదో,
ఆనంద సుధలలో నటుదేలిపోతాను!

## చిన్నారి పొన్నారి!

చిన్నారి పొన్నారి చిఱు దీపకళికనూ!
పూరిగుడిసెను వెలిగి పొలుపు గులుకుచునుంటి!

దీన జనులకు మధ్య దీప్తి గలిగింపగా
పని నాకు గల్పించె పరమాత్ముడే గదా!

చిన్నారి పొన్నారి చిఱు దీప కళికనూ!
పూరిగుడిసెను వెలిగి పొలుపు గులుకుచునుంటి!

ఆకలిని యల్లాడు యార్తులందఱి మధ్య
పేదసాదల బ్రతుకు వేదనల గాంచుచూ!
కటికచీకటి యందు కాఱునలుపుల మధ్య
చిఱుదీప కాంతిలా సింగారమై యుంటి! ॥చిన్నారి॥

మానవత్వము, ప్రేమ, మంచితనములు గలిగి
మనిషిలో నిండయిన మధురత్వమును గలుగ!
మనుషు లిద్దెలకో మానవత గోల్పోయి
దుఃఖ సంద్రమునందు దురపిల్లు టెందుకో! ॥చిన్నారి॥

కాంతితో వెలగాలి కాంతిలో నడవాలి!
బంగారు బాటలో బ్రతకాలి మానవుడు!
తోటి వారందఱిని తోడుగా జూడాలి!
మనిషి మనిషిగ బ్రతికి మధువులే చౌలకాలి!

చిన్నారి పొన్నారి చిఱుదీప కళికనూ!
పూరిగుడిసెను వెలిగి పొలుపు గులుకుచునుంటి!

ఆషాఢ మేఘముగ యలరి యొకచోటనే
గూడుగా కట్టుకొని కూర్చుండ నీకూ!
కార్తీక మేఘాలు గగన మందంతటా
దిరుగు నటులుగ జేయి దీరుగా నలుదిశల!
ఆషాఢ మేఘముగ యలరి యొకచోటనే
గూడుగా కట్టుకొని కూర్చుండ నీకూ!

గూడొకటి కట్టుకొని గూటిలో నేనుండి
నూతిలో కప్పవలె నొరిగుండ లేనోయి!
'తరులన్ని నావి'యని దగ కోకిలకు వోలె
మధుర గానముతోని మననిమ్ము కృష్ణా! ॥ఆషాఢ॥

కొండ కోనలమధ్య కోనేరునకు వోలె
నిలిచియుండగలేను నీడగా ప్రకృతికి!
సెలయేఱునకు వోలె జలజలా ప్రవహించి
అడవిదారుల వెంట యలరి నను బోనిమ్ము! ॥ఆషాఢ॥

అందఱను గలిసి నే నానంద మొందునటు
అన్ని యందాలు నే నపురూపముగ బడసి!
గోపకన్నెకు వోలె గోపాల! నిను గూడి,
ఆడిపాడగ నేను నలరునటు దీవింపు!

ఆషాఢ మేఘముగ యలరి యొకచోటనే
గూడుగా కట్టుకొని కూర్చుండ నీకూ!

## చల్లనీ నా మాట!

చల్లనీ నా మాట! సరసముగ వినవు గద!
నీ పాట నీది గద! నీ మాట నీదే!

పాటలో భావమును బరగ మది నాలించి
నా హృదయ వేదనను నాథ !దీర్పవు గదా!

చల్లనీ నా మాట సరసముగ వినవు గద!
నీ పాట నీది గద! నీ మాట నీదే!

అడవి పూవుగ నేను నలరారుచే గాని
అందనీ నీ ప్రీతి యందుకొన లేదు గద!
నిండార నీ చూపు నిలిచి కనుగొనలేదు
బండగా పడియుంటి నిందుశాపము తోని! ॥చల్లనీ॥

అలలుగా దరికొచ్చి విరిగి పోవుచునుంటి
గాలి వీచిన మబ్బు కథవోలె నే నుంటి!
వినయ గీతిని దయను వినిపించుకోవు గద!
కన్నీటి తెరలలో గలత మునుగుచునుంటి! ॥చల్లనీ॥

ఆకాశ మల్లియల యందాల దండతో
నా మధుర గీతితో నా కథను వినిపించి,
పాటబాడితి గదా! భవ్య శ్రుతి రాగాన!
వినిపించుకోవు గద! విమలార్ద్రి భావాన! ॥చల్లనీ॥

వేచియుందును స్వామి! యెన్నినాళ్ళయిన యిటు
మధుర గీతముతోని మాధవా! యనుచునూ!
నే నిరాశనుగాని నిస్పృహను జెందనూ!
నీ నిరీక్షణము నే నిలిచి గాంతును భక్తి! ॥చల్లనీ॥

## పాట మొదలిడిన!

పాట మొదలిడిన మఱి పద్యమే మొదలిడిన
ఏ చందమున నేను నింపుగా బాడినా!

నీ మధుర నామమున నిర్మలముగను ముగిం
నా విరహ వేదనను నయముగా నంతమగు

పాట మొదలిడిన మఱి పద్యమే మొదలిడిన
ఏ చందమున నేను నింపుగా బాడినా!

వెన్నెలా రాత్రులను వీణ మ్రోగించినా,
కొండ కోనలలోన కోకిలగ పాడినా,
గిరి సోనవలె నేను కిలకిలా నవ్వినా,
నీ మధుర నామమున నిఖిల! మఱి తుది యగును!

కిన్నెరను మీటుచూ కీర్తనను బాడినా,
వేయి దీవెల వీణ వేడ్క మ్రోగించినా,
శ్రుతిలయల బద్ధమై సుందరము విరిసినా
నా విరహ వేదనలు నాట్యమాడుచునుండు!

నీ మధుర నామమును, నా విరహ వేదనయు,
తుది యందు నిలుచునూ దోరముగ గీతినీ,
నీదు అన్వేషణము నిరతమును సాగింతు
మధురమగు పదముల్లను మధురాక్షరములందు!

పాట మొదలిడిన మఱి పద్యమే మొదలిడిన
ఏ చందమున నేను నింపుగా బాడినా!

## రావియాకుగ నన్ను!

రావియాకుగ నన్ను రమ్యముగ ప్రతిక్షణము
దీరుగా కదిలించు దివ్యానుభూతులను!

మదిని గదిలించుచును మాధుర్యమును నొలుక
నీ మురళి ధ్వనులతో నింపుమా! నిరతమును!

రావియాకుగ నన్ను రమ్యముగ ప్రతిక్షణము
దీరుగా కదిలించు దివ్యానుభూతులను!

నీ మధుర గీతమును నెమ్మనము నందునను
మ్రోగునటు గావింపు మోదమున నిరతమును!
తుమ్మెదగ వలె నేను దూలుతూ బాడుతూ
బారవశ్యముజెంద బరగ నను గావింపు! ॥రా॥

వెన్నెలా పక్షిలా వేడ్క చంద్రుని కొఱకు
ఎదురు జూచేరీతి మది నిరీక్షించుచును!
ఎడతెగని విరహమును కడలి యంచులదాక
విహరించు నటుల నను వేణు! గావింపుమా! ॥రావి॥

కరుణించి దయతోని కనికరించినగాని
కడకు ద్రోసినగాని కలత నే బడనటుల!
నీ భక్తి గీతమును నిలుపుమా! మదియందు!
ఎన్ని జన్మలుగాని చెన్నుగా గడుపుదును!

రావియాకుగ నన్ను రమ్యముగ ప్రతిక్షణము
దీరుగా గదిలించు దివ్యానుభూతులను!

## నీ వెంట నే వత్తు!

నీ వెంట నే వత్తు! నిఖిల నే నెటకైన
నీవైపు నే జూతు! నిలిచి యెటనున్నా!

ఏకాగ్రతను జూతు! ఎంత మరుగున్ననూ
నీ పాదముల జాడ! నిఖిలాత్మ! నడచెదను!

నీవెంట నే వత్తు! నిఖిల నే నెటకైన
నీవైపు నే జూతు! నిలిచి యెటనున్నా

ఎంతదూరము నున్న యేవైపు నున్ననూ,
రోహిణీ సతిగాంచు రూఢిగా దనపతిని!
ఎన్ని తారల మధ్య యెట నుండినా గాని
తిన్నగా జందురుని దీరుగా మది గాంచు! ॥నీవెంట॥

సప్తఋషులందునను దగ. వసిష్ఠుడు గూడ
దగ కలిసి పయనించు సమయమందున నైన!
అల యరుంధతి సతియు నలరి తల వంచుకుని
పతితోని బయనించు బరగ విడువక యెపుడు! ॥నీవెంట॥

అటులనే నేగూడ యలరి గాంచెద నిన్ను
మబ్బులను నీవున్న మరుభూమి యుండినను!
చూపులను మరలించి జూడ దశదిశలనూ!
అడుగుజాడల నిన్ను ననుసరింతును స్వామి!

నీవెంట నేవత్తు! నిఖిల! నే నెటకైన!
నీవైపు నేజూతు! నిలిచి యెటనున్నా!

## ఆది యంతము లేని!

ఆది యంతములేని యన్వేషణము నందు
నొసరి యెక్కుచునుంటి యొక్కొక్క మెట్టూ!

ఒక్కొక్క మెట్టునూ యొసర దిగి నా వైపు
వచ్చుచున్నా వనుచు నొసర నే దలతునూ!

ఆది యంతములేని యన్వేషణము నందు
నొసర యెక్కుచు నుంటి యొక్కొక్క మెట్టూ!

తీయనీ రాగాల తేనెలను గ్రోలుచును
మధుర గీతము తోని మంజులంబగు శ్రుతిని!
నీ పాదముల కడకు నే వచ్చుచుంటినని
మనసునను దలచెదను మాధవా నే నెపుడు! ॥ఆది॥

మధుర మురళిని నూది మాధుర్యముల జింది
విశ్వమంతా నీదు విమల స్వనములు నింపి
నను జేర వచ్చుచున్నా వనుచు దలచెదను
మురళి మాధుర్యమున మోదమున గలిపికొన! ॥ఆది॥

ఎన్నెన్ని మెట్టులను నే నేగవలయునో,
ఎన్నెన్ని మెట్టులను నీవు దిగవలయునో!
నీదు నన్వేషణము నిరతమును నీ విధము
సాగవలసినదేన? సర్వకాలము నిటుల!

ఆదియంతము లేని యన్వేషణము నందు
యొసర మెక్కునుంటి యొక్కొక్క మెట్టూ!

## త్వరపడుటయు లేదు!

త్వరపడుటయును లేదు! దొట్రుపాటును లేదు!
అందాలకృష్ణ! నిన్నందుకొనుటకునూ!

ఎదురుజూతును స్వామి వేలవత్సరము లిటు
గగన తారకల వలె కమనీయముగ నిలిచి!

త్వరపడుటయును లేదు దొట్రుపాటును లేదు!
అందాల కృష్ణ! నిన్నందుకొనుటకునూ!

నెలలు, ఋతువులు భువిని నిఖిలమగు మార్పులను
అందాల ప్రకృతిని యలరి క్రొత్తను దాల్చు!
నే మార్పు జెందనూ! నిస్తేజ మొందనూ!
నీ నిరీక్షణమునను నిలిచి యుండెద నెపుడు! ॥త్వర॥

జన్మజన్మలు నిటుల జాగృతిని, భక్తినీ
నీ మధుర గీతమున నేను పయనించెదను!
మరుభూములన్నియును మానుగా కానలను
ఒంటిగా పయనింతు! నొలుక నే గన్నీరు! ॥త్వర॥

మధుర పద రచన నామది యందు నున్నదీ,
కూర్మి తీయని గీతి గొంతులో నున్నదీ!
గుండెలో నుండెగద! కొనురొప్ప నీ భక్తి
యుగయుగములు గూడ దగ నిరీక్షించెదను!

త్వరపడుటయును లేదు! దొట్రుపాటును లేదు!
అందాల కృష్ణ! నిన్నందు కొనుటకునూ!

## మోదమున దూరముగ!

మోదమున దూరముగ మురళి మ్రోగించుటయు
బరగ నిను జూడగా బరుగు లెత్తుటయూ!

దినదినము జరిగేటి తీరైన కథ గాద!
నన్ను మురిపించేటి నాథ! నీపని గాద!

మోదమున దూరముగ మురళి మ్రోగించుటయు
బరగ నిను జూడగా బరుగులెత్తుటయూ!

ఆటుపోటుల వోలె యాశా నిరాశలను
భరియింపగా జాల బాధ నీతో రోజు!
ఈ నిరీక్షణ మెపుడు నింపుగా ముగియింతు?
మదియందు జరుగు యీ మథన మెటు చాలింతు? ॥మోద॥

ఈరోజు నీమురళి యింపుగా నదియేమొ!
క్రొత్త పాటను నేడు గూర్మితో బాడినది!
బరువాయె నా యెదయు బాధతో నిండినది!
కనుల ముందఱ యేవొ కాంతు లుదయించినవి! ॥మోద॥

పాదములు దొట్రిలుచు బడిపోవుచుంటినీ!
సెలయేటు దాక నే జేరజాలగ లేను!
విధి భయంకర మగుచు వేధించు చున్నదీ!
నిను జేర లేనోయి! నీవె నా దరి జేరు!

మోదమున దూరముగ మురళి మ్రోగించుటయు
బరగ నిను జూడగా బరుగు లెత్తుటయూ!

## అడిగేటి ప్రశ్నలకు!

అడిగేటి ప్రశ్నలకు అరవింద నేత్ర విను!
బదులేమి బలుకుదును పదిమందితో నీ?

మనసులో జరిగేటి మర్మ వేదన యంత
మధురముగ దెలుపుదును మర్మ మింతయు లేక?

అడిగేటి ప్రశ్నలకు అరవింద నేత్ర విను!
బదులేమి బలుకుదును పదిమందితో నీ?

మురళి వినుచుంటినని మోదమున బలుకుదువు!
మాధవుని పూజకై మాపూలు గొనిపోయి!
మాలగా గ్రుచ్చెదవు మది మెచ్చెనా నిన్ను
పూలమొక్కలు నడిగె పొలుపుగా నిలదీసి! ॥అడిగేటి॥

అందాల కృష్ణునకు నమల భక్తిని నీవు
కలువ దామరపూల కాన్కలని దెలిపెదవు!
కనిపించెనా విభుడు గనులబండువు గాగ
నవ్వుచును బ్రశ్నించె నాథ! యాకొలకు మజి? ॥అడిగేటి॥

పాడుచుందువుపాట బరవశము జెందగా!
అందాల కృష్ణుడూ యగుపించెనా యనుచు!
చిలుక గోరింకలవి చిత్రముగ ప్రశ్నించె
ఏమిదెలుపుదు స్వామి! యింపుగా మదివిప్పి? ॥అడిగేటి॥

కనులలో మనసులో కానిపించునుగాని
కనులముందఱ నిలిచి కనరాడు యెందుకో?
చెవులలో వినిపించు జెన్నుగా శ్రీమురళి
సనుజేర రాదని నాథ! దెలుపుదు ప్రజకు! ॥అడిగేటి॥

## కమనీయమైన!

కమనీయమైన నీ కాంతిరేఖను నేను
కటికచీకటియందు కాంతి మిణుగురుసూ!

ప్రతిబింబమును నేను బరగ నీ ఛాయనూ!
అతిప్రేమ గురిపించి యాదరించితివీ!

కమనీయమైన నీ కాంతిరేఖను నేను
కటిక చీకటియందు కాంతి మిణుగురుసూ!

పక్షివలె గగనాన బరుగు లెత్తించితివి!
చుక్కలను చుక్కనై సుందరత గాంచితిని!
ప్రకృతియందాల నిల బరికింప నేర్పితివి!
బరగ నీలో గలియ పథము జూపించితివి! ॥కమనీయ

కంటి కగబడకున్న జంటగా భావించి
సఖుడవని భావించి సఖ్యతను జూపెదను!
నా యందు నీవుండి నడుపు చున్నావనుచు
బరవశము జెందుదును భక్తి జివురులు వేయ! ॥కమనీయ॥

మనిషిపై యెందుకిటు మధురానురాగాలు?
మధుర ప్రేమను గురిసి మమత జూపించితివి!
ధ్యానరాగంబులను దయతోని నిచ్చితివి!
సంపూర్ణముక్తికై సారథిగ నుంటివీ!

కమనీయమైన నీ కాంతిరేఖను నేను!
కారుచీకటియందు కాంతిమిణుగురునూ!

# ఎన్నెన్నొ భావాల

ఎన్నెన్నొ భావాల యల్లికను నేర్పితివి!
చిన్నికృష్ణా! నన్ను జేరదీసియునూ!

కనబడకయుండినా కారుణ్యనిధి నిన్ను
కానబడినటుల నే కథలు వ్రాయుచునుంటి!

ఎన్నెన్నొ భావాల యల్లికను నేర్పితివి!
చిన్నికృష్ణా! నన్ను జేరదీసియునూ! ॥ఎన్నెన్నొ॥

నీ మురళి రవములనుకొన్ని స్వనములు గలవు
ఈ మధుర ప్రకృతిని కొన్ని రంగులు గలవు!
నా గుండెలో పాట వేల శ్రుతులను విరియు
నా చిత్రమగు కనుల కోటిరంగులు వెలుగు! ॥ఎన్నెన్నొ॥

అలవి గానట్టి యెవో యపురూప భావాల
నిన్ను భావించుచును నిర్మలత నొందితిని!
బంధముక్తిని జెంది బరువైన గుండెతో
బయనించుచుంటిగద! ప్రగతి శీలములతో! ॥ఎన్నెన్నొ॥

నీదు క్రీనీడలో నిఖిలమంతయుగూడ
అంది యిచ్చితివిగద! యలరు నీ శక్తియును!
మనసు దొంతరలలో మాణిక్యముల జేర్చి
మానవుని దేవతగ మార్చితివి పరమాత్మ!

ఎన్నెన్నొ భావాల యల్లికను నేర్పితివి!
చిన్నికృష్ణా! నన్ను జేరదీసియునూ!

## నే పలికే

నే పలికే ప్రతి పాటను!
నే పలికే ప్రతి కవితను!

విరహగీతి దాగి యుండు!
విమలమైన కృష్ణభక్తి!

నే పలికే ప్రతి పాటను
నే పలికే ప్రతి కవితను!

కన్నీళ్ళను నొలుకుచుండు
కమనీయపు విరహముతో!
నా స్వామిని గలియుటకై
నలుగుచుండు నే నిరతము!

॥నేపలికే॥

పల్లవి నే బాడుచుండు
ప్రవిమల భక్తిని గూడి!
వెదుకుచుండు నా స్వామిని
వీథులందు నగరు లందు!

॥నేపలికే॥

అందుకొనగ నా స్వామిని యమల గానమును నేర్చితి
తీయని నా పాటతోని దీరుగ నాతని గలియగ!
అందులకై విరహిణినై యాటుపోటులను బొందుచు
కొండ కోనలను బాడుచు కోకిలనై దిరుగుచుంటి!

నే బాడే ప్రతిపాటను
నే పలికే ప్రతి కవితను!
విరహగీతి దాగియుండు! విమలమైన కృష్ణభక్తి!

## ఉన్నావో లేవో మఱి!

ఉన్నావో లేవో మఱి కన్నులతో గాంచలేదు!
ఉన్నావని నా మనసున
యూహ గలుగుచున్నదోయి!
ఉన్నావో లేవో మఱి కన్నులతో గాంచలేదు!
ఉన్నావని నా మనసున యూహ గలుచున్నదోయి!

అందులకే గదస్వామీ! యడవులన్ని తిరిగి తిరిగి
వెదకి తెచ్చుకుంటిగదా
వ్రేపల్లియ నుండి నిన్ను!
ఉన్నావో లేవో మఱి కన్నులతో గాంచలేదు!

గుండెయందు దాచుకుంటి యండగ నిను భావించుచు
సందియ మింతము లేదూ!
సర్వస్వము నీవు నాకు!
ఉన్నావో లేవో మఱి కన్నులతో గాంచిలేదు!

వెన్నెలలో జీకటిలో కణ్ణ! నిన్ను మది దలతును!
నర్తింతును గోపికనై నాథ! యనుచు బిలుతు నిన్ను!
నా గీతికలను బాడుచు నర్తన నిను జేయింతును
నీదు మురళి వినుచుందును నిత్యము నా హృదయమందు!

ఉన్నావో! లేవో! మఱి
కన్నులతో గాంచలేదు!
ఉన్నావని నా మనసున యూహ గలుగుచున్నదోయి!

## కొండ శిఖరమ్ముపై!

కొండ శిఖరమ్ముపై కూర్మితో వెలసినా
మహనీయమూర్తి! నా మనవి విను దయతో!
కోనలో నేనుంటి కూర్మి నా కుటియందు
కానుకలు దేలేను! కమనీయ హారాలు!

కొండ శిఖరమ్ముపై కూర్మితో వెలసినా
మహనీయమూర్తి నా మనవి విను దయతో!

కొండ శిఖరమునుండి కోనవఱకును నేను
తొలిసంధ్య రేఖలను దోరణము గట్టితిని!
వెన్నెలా పువ్వులను వేడుకను బఱచితిని
కలువ తామర పూల కాంతులను నింపితిని! ॥కొండ॥

చిలుక గోరింకలను జిన్నారి కోయిలల
దారి పొడుగున నిలిపి దగ నీకు స్వాగతము!
బలుకగా నియమించి జలపక్షులను నేను
అర్థించితిని నిన్ను నిటకుగొని రమ్మనుచు! ॥కొండ॥

అందఱి ముందు నిను నర్థింపగా లేను
పదిమందిలో నిన్ను ప్రార్థింపగా లేను!
దెలుపదలచితి స్వామి! దీరుగా మది కోర్కె
జన్మజన్మలనాటి కర్మమును దొలగింప!

కొండ శిఖరమ్ముపై కూర్మితో వెలసినా
మహనీయమూర్తి! నా మనవి విను దయతో!

## కొండ కోనల యందు!

కొండ కోనల యందు కోనేరు దరిపైని
నిర్మించితిని స్వామి! నే కుటీరమునూ!

నిను మదిని దలచుచును, నీ పాట బాడుచును
నీ రాక కొఱకునై నిలిచియుంటిని స్వామి!

కొండ కోనల యందు కోనేరు దరిపైని
నిర్మించితిని స్వామి! నే కుటీరమునూ!

దూరాన సెలయేఱు దొరలుచును దూలుచును
వినిపించుచుండు ధ్వని విమల రాగముతోని!
కోకిలమ్మయు గూడ కూర్మి బాడుచునుండు
మావికొమ్మలపైని మధురిమల నొలుకుచును! ॥కొండ॥

ప్రక్కలను కోనేరు బరిమళించుచునుండు
కలువ తామరలతో కమ్మని కాంతులను!
జలపక్షు లెపుడు నట జలక్రీడ లాడుచును
కనుల బండువు సేయు కలరవము సేయుచును! ॥కొండ॥

చిన్ని దీపము గుటిని చిఱుకాంతి దొలుకుచును
నా బీదతనములను నాథ! దెలుపుచునుండు!
నాదు కిన్నెర మ్రోగు నళినాక్ష! యెల్లపుడు
నీ స్వాగతము గీతి నిర్మలముగా బాడు!

కొండ కోనలపైని కోనేరు దరిపైని
నిర్మించితిని స్వామి! నే కుటీరమునూ!

## అర్ధంకు లెన్నయిన!

అర్ధంకు లెన్నయిన యలరి విరిసిన గూడ
హరి నిన్ను వెదుకుదును నలరి తుది దాకా!

ప్రత్యూషువు నీ కొఱకు ప్రణయమున దపియించు
గాఢాంధకారమున కాంతి లేఖను గాంతు!

అర్ధంకు లెన్నయిన యలరి విరిసిన గూడ
హరి నిన్ను వెదుకుదును నలరి తుది దాకా!

చిత్రమగు నీ రూపు చిన్నారి మురళినీ
గాంచువఱకును విడువ కమనీయ దీక్షనూ!
నీ కరుణ ప్రస్తార మెటనుండి మొదలగునో!
యటకు జనుదెంతు నే నలరి చిఱునవ్వులను! ॥అర్ధంకు॥

ఈ జన్మమున నిన్ను నింపుగా గనలేక,
విఫలత్వమును బొంది, విధి వక్రతను నంది,
కాలగతి నొందినా కమనీయమూర్తి విను!
మఱుజన్మలో గూడ మానుగా కొనసాగు! ॥అర్ధంకు॥

ఈ పాట కొనసాగు! నీ విరహ వేదనయు
మఱల మొదలగును సుమ! మాధవా! విడువకను!
జన్మ జన్మలు నిటులె మధుర యన్వేషణము
కొనసాగుచుండు గద! కోర్కె నిను గాంచగను!

అర్ధంకు లెన్నయిన యలరి విరిసిన గూడ
హరి నిన్ను వెదుకుదును! నలరి తుది దాకా!

## నిండు జీవితమంత!

నిండు జీవితమంత నీదు నన్వేషణము
కథవోలె చిత్రముగ గడిచి పోయినదీ!

నిన్ను వెదుకుచు మదిని నీ దారి వెదుకుచును
జెన్నుగా నుంటినీ చిరకాల వేదనను!

నాదు జీవితమంత నీదు నన్వేషణము
కథవోలె చిత్రముగ గడిచిపోయినదీ!

కొండ కోనలయందు గొమరొప్పు వనములను
చిగురులను బూవులను జెన్నార కొలనులను!
అంత వెదుకుచునుంటి యపురూప దేశముల
కలువ తామరలందు కరుణ గీతములందు ॥నిండు॥

మావి తోపులయందు మైదానములయందు
గిరిశిఖములయందు గీర్తించి వెదికితిని!
నదులందు సరులందు నవనీత! నీ కొఱకు
ఆటుపోటుల వార్ధు లందందు వెదికితిని! ॥నిండు॥

మనసునను దాగుండి మమత బెంచెదుగాని,
కనులముందఱ నిలిచి కనిపింప వోవుగా!
పొన్నచెట్టున దాగి చెన్నుగా శ్రీ మురళి
పాట బాడెదుగాని ఐన్నుగా గనరావు!

నిండు జీవితమంత నీదు అన్వేషణము
కథవోలె చిత్రముగ గడిచిపోయినదీ!

## చక్కనీ శ్రుతి లయల!

చక్కనీ శ్రుతిలయల చక్కనగు నొకపాట!
మక్కువగ గూర్చుచును మగువ! నే నుండగా!

ఖిక్షకుం డొకడొచ్చె పేదచూపులతోని
జోలి చంకను దాల్చి లీలగా ద్వారమున!

చక్కనీ శ్రుతిలయల చక్కనగు నొకపాట
మక్కువగ గూర్చుచును మగువ! నే నుండగా!

నా పాట సొగసులను నయముగా భంగింప,
నా భక్తి దీక్షలను నాతి! జెఱుపగ దలచి!
అలరి వచ్చెనటంచు నలక నే జెందుచును,
పొమ్మంటినో చెలీ! బొందుగా ఖిక్షకుని! ॥చక్కనీ॥

జోలెలో నుండి యొక నాణెమును జే దీసి!
వీధి ద్వారమునుంచి వెస వెడలిపోయెనే!
తరువాత దెలిసితిని! తరుణి! యా నాణెమును
బంగారు నాణెముగ బరగ గుర్తించితిని! ॥చక్కనీ॥

బంగారు నాణాలు గలవాడు నా రీతి,
నా ద్వార పీఠికను నాతి! యెందులకొచ్చె?
పాటలోనున్న యా పరమేశు డొచ్చెనే,
గుర్తింపలేక నే వర్తించి తా రీతి!

చక్కనీ శ్రుతిలయల చక్కనగు నొకపాట
మక్కువగ గూర్చుచును మగువ నే నుండగా!

## ప్రకృతి యందాలన్ని!

ప్రకృతి యందాలన్ని నీ యందు నున్నవీ,
ప్రకృతి యందాలన్ని నీ యందములుగా!

అణు వణువునందునను నంతటా నీ రూపు
నీదు క్రీ నీడ గద! నిఖిలేశ! యీ ప్రకృతి!

ప్రకృతి యందాలన్ని నీ యందు నున్నవీ!
ప్రకృతి యందాలన్ని నీ యందములుగా!

ఆకాశ మల్లియలు నలరుచును నొక్కొకటి
భూమిపై రాలుటను బొలువుగా నే దలతు!
మంత్రాక్షతలతోని మానుగా దీవెనలు
అంది యిచ్చుచు నుంటి వని మదిని దలతునూ! ॥ప్రకృతి॥

వెన్నెలల పూవాన వలనొప్ప పడుపుటను
ఆకాశ గంగగా నలరి నే దలతునూ!
దూరాన కోకిలల దోరంపు పాటలను
సామగాన మటంచు దలతు నే మది యందు! ॥ప్రకృతి॥

కొండ కోనలు గిరులు గూర్మి వన వీదులును,
చిగురు పూవులు మఱియు జిత్రమగు కొలకులును,
నీదు ప్రతిరూపమే! నీదు ఛాయలు గదా!
మనిషి మంచితనంబు మఱి నీవు గద! స్వామి!

ప్రకృతి యందాలన్ని నీ యందు నున్నవీ!
ప్రకృతి యందాలన్ని నీ యందములుగా!

## గొంతులో మాధుర్య!

గొంతులో మాధుర్య మింతయును లేదు సుమ!
తీయదనములు మాసె తెగిన తంత్రిగనూ!

మనసులో నీ గీతి మధుర శ్రుతిలయలతో
నూత్న వధువాయెగా! నూత్న రాగాలతో!

గొంతులో మాధుర్య మింతయును లేదు సుమ!
తీయదనములు మాసె తెగిన తంత్రిగనూ!

పాడి పాడీ గొంతు పతనమై పోయినది,
మ్రోగి మ్రోగీ వీణ మూగగా మారినది!
గుండెలో యెందుకని క్రొత్త రాగాలతో
పదము వెలయుచునుండు, బల్లవిని బాడుచూ! ॥గొంతులో

వాడిపోలేదుగా వన్నెలను నా పాట
మాసిపోలేదుగా మల్లెపూ దండగా!
పారిజాతము వోలె పరిమళము పోలేదు!
ముత్యాలసరము వలె ముద్దుగులుకుచు నుండు! ॥గొంతులో॥

గుండెలో నున్నావు కోటి యందాలతో,
మాధుర్యమును జిందు మధుర గీతముతోని,
నా గుండె పాడుకొను నళినాక్ష! నీ పాట!
వేలరాగాలతో విరులు గురిసిన యటుల!

గొంతులో మాధుర్య మింతయును లేదు సుమ!
తీయదనములు మాసె తెగిన తంత్రిగనూ!

## అంతమే లేదుగా!

అంతమే లేదుగా !హరి నీదు కీర్తనకు
సొంతమే లేదుగా! సుంత నీ పాటకును!

వార్థి కెరటాల వలె వరుసగా ప్రవహించు
నా గుండెలో పాట నవనీత! యాగదూ!

అంతమే లేదుగా హరి నీదు కీర్తనకు
సొంతమే లేదుగా సుంత నీ పాటకును!

నీ మురళి దానాలు నిత్య నూతనములును
నీ సృజన శక్తియును నిత్య నూతనము గద!
ఆగిపో వెన్నడును నాటుపోటుకువోలె
తెరమీది బొమ్మగా జరిగిపోవుచు నుండె! ॥అంతమే॥

ా గుండెలో పాట నవనీత! యాగదూ!
లయేటి జాలులా జరిగిపోవుచునుండు!
ది చరణమే లేదు మదిలోని భావాల
ా పాట ముగియదూ! నాథ! యెన్నటికైన ॥అంతమే॥

నీ సృజన శక్తియును నా పాట రక్తియును
జరిగిపోవుచునుండు జగము నడిచేదాక!
ముగియ దెన్నటికినీ మోదమున తుదిలేదు!
మనిషి మాధవునికివి మారనీ బంధాలు!

అంతమే లేదు గద! హరి నీదు కీర్తనకు
సొంతమే లేదుగా సుంత నీ పాటకును!

## ఎన్ని వసంతాలు!

ఎన్ని వసంతాను యిలపైని గడిచినవి!
ఎన్ని హేమంతాలు యిలపైని దొరతే!

రావు గద శ్రీకృష్ణ! రమణిపై దయయుంచి
మూగవోయెను గొంతు! రాగాన శ్రుతి దొలచి

ఎన్ని వసంతాలు యిలపైని గడిచినవి
ఎన్ని హేమంతాలు యిలపైని దొరతే!

కాలగతిలో నేను కలిసిపోయిన వెనుక
వత్తువని భావింతు! చిత్తమున దయదలచి!
శూన్య మందిరమందు జూచెదవు దీపమును
అటనున్న పూవండ! నా మధుర కిన్నెరను! ॥ఎన్ని॥

మధురమౌ గీతమును మాధుర్య వేదనను
బాడుకొను మురళితో బారవశ్యము జెంది!
స్మరియింపు మొకసారి విరహిణిని యానాటి
మధుర గోపిక నంచు మానసము బొంగార! ॥ఎన్ని॥

చిలుక గోరింకలును చిన్నారి జింకలును
నిను జుట్టి వేయునూ నిలువెత్తు నెగురుచును!
కరుణింప లేదనుచు గళినములు బలికేను!
కోపింపకుము కృష్ణ! కూర్మి ప్రీతిని గనుము!

ఎన్ని వసంతాలు యిలపైని గడిచినవి!
ఎన్ని హేమంతాలు యిలపైని దొరతే!

## అంతులేనీ యాత్ర!

అంతులేనీ యాత్ర! ఆనంద యాత్ర యిది!
విభుని కలయికకునై విడివడని యాత్రా!

జన్మ జన్మల నాటి దీ మధుర బంధమూ!
మర్మ మడుగకు మమ్మ! మది రగులు జ్వాలగా!

అంతులేని యాత్ర! ఆనంద యాత్ర యిది!
విభుని కలయికకునై విడివడని యాత్రా!

గిరుల పర్వతములను, సరితలను, వాగులను
అన్ని దాటెదనమ్మ! అతని కొఱకై నేను!
అగ్ని పర్వతములను నలవార్థి తరగలను
అంధకారము జిమ్ము నల పర్వతపు గుహలు!॥ అంతులేనీ॥

గిరివాగు మఱుభూమి జరిగి ప్రవహించుచును
మాయమైనటుల నే మాయమై పోయెదను!
నల్లనీ మేఘాలు నలువైపు గాలులకు
లుప్తమై నటుల నే లుప్తమై పోయెదను!

అలసత్వమును లేదు! నాలస్యమును లేదు!
అడుగు వెనుకకు వేసి యట నిలుచుటయును లేదు!
పాట నిలుపను నోట పరమ మృగు కిన్నెరను
ఆవజాలను సఖి! ఆనంద యాత్ర యిది!

అంతులేనీ యాత్ర! ఆనంద యాత్రయిది!
విభుని కలయికకు నై విడివడని యాత్ర యిది!

# అందాల వీణియను!

అందాల వీణియను నలరించి తంత్రులను
మధుర గీతిక బాడ మమత గూర్చుంటి!

పాట సమకూర్చితిని! పరమ సుకుమారముగ
మధురాక్షరములతో మంజులంబుగ చెలియ!

అందాల వీణియను నలరించి తంత్రులను
మధురగీతిక బాడ మమత గూర్చుంటి!

పంజరములో జిలుక బలుమారు లడిగినది!
గూటిలో గోరింక కూర్మితో యాచించె!
గువ్వజంటయు గూడ రివ్వుమని యెగిరొచ్చి
పాటబాడు మటంచు బరగ యాచించినవి! ॥అందాల॥

గొంతెత్తి నా పాట కూర్మితో బాడగా
మొదలుబెట్టితి సఖీ! మోము వికసింపగా!
ఇంతలో వినబడెను వీధి గుమ్మము నందు!
మరణకాల మృదంగ మది నాకు వినబడెను! ॥అందాల॥

నూరేండ్ల వృద్ధుడట! నేలబడి యుండెనట!
దిక్కెవ్వరును లేని దీనుడట! హీనుడట!
ఓదార్చ వారునూ వనరలేరట చెలియ!
కన్నీరు దొలికేటి గలవారు నట లేరు! ॥అందాల॥

మధుర గీతము బాడి మమతతో మునుగుదున?
వృద్ధునికి సేవలను నొద్దికగ సేయుదున?
వాకిలిని బడియున్న వాసుదేవుని భక్తి
సేవజేయగ దలచి దీరుగా వెడలితిని! ॥అందాల॥

## చీకటిని జయనించు!

చీకటిని జయనించు జిరకాల విరహిణిని!
వేదనల రోదనల విరహ గీతికనూ!

గోపబాలుని గాంచ కూర్మి కోరికతోని
సర్వమొదిలిన దాన సంసార రీతులను!

చీకటిని జయనించు జిరకాల విరహిణిని!
వేదనల రోదనల నిరహ గీతికనూ!

ఇల్లు వాకిలి నొదిలి యిహ సౌఖ్యములనొదిలి
పాదయాత్రను బోవు బధికురాలిని గదా!
శ్రుతిలయలు దప్పినా శృంగార గీతినీ
పాడుచును బోయేటి పడతిని గదోయీ!

గిరులు నదు లడవులను జరియించుచుంటినీ,
మరుభూములందు నే మసలుచుంటినిగా!
అడుగబో నెవరినీ యాదారు లెచటికని
నా గమ్య గమనముల నలువురికి దెలుపనూ!

పిచ్చిదాన నటంచు బ్రీతి జలికెదరు బ్రజ
మతిభ్రమణ మాయెనని మతికొంద రందురూ!
అన్నిటిని సహియింతు అచ్యుతా! నీ కొఱకు
కాలకూటము శివుడు కమ్మగా నిలిపి నటు!

చీకటిని జయనించు జిరకాల విరహిణిని
వేదనల రోదనల వినుల గీతికనూ!

## గాయపడినది గుండె!

గాయపడినది గుండె కఱఁగి నీరయినదీ
దయలేదుగా కృష్ణ! దాసిపై నింతా!

నీ విరహమునగదా! నిఖిలమును నే వదిలి
అడవిదారుల వెంట నరుగుచుంటిని కృష్ణ!

గాయపడినది గుండె! కఱిగి నీరయినదీ!
దయలేదుగా కృష్ణ! దాసిపై నింతా!

తరుల పూలతలనూ దగచల్ల గాలులను
కృష్ణు డెచ్చట యనుచు గ్రుచ్చి యడుగుచు నుంటి!
వనవీథి యంతటను వన్నె లొలికించేటి
తుమ్మెదల నడుగుచును దుఃఖించుచుంటినీ! ॥గాయ॥

సన్నగా జారేటి చిన్ని సెలయేఱులను
ఎవరు లేనట్టి యా యేకాంత దేశముల!
కొండ కోనలను మఱి కోనేటి యంచులను
నిలిచినా కలువలను నీ జాడ లడిగితిని! ॥గాయ॥

ఎచట నున్నావో! ప్రభు! నెందు దాగుంటివో!
కంటి కగబడరాద! కమనీయ రూపాన!
అలసిపోయిన నన్ను నాదరింపగ రాద!
కనిపించి యొకసారి కరుణింప గూడదా?

గాయపడినది గుండె! కఱిగి నీరయినదీ!
దయలేదుగా! కృష్ణ! దాసిపై నింతా!

## మనసు మలుపుల జేరి!

మనసు మలుపుల జేరి మాధుర్య మొప్పగా
మురళి మ్రోగించేటి మోహనా కృష్ణా!

దూరాన నుంటివని దురపిల్లు చుంటినీ!
కనుల కగుబడు మనుచు గలహించుచుంటీ!

మనసు మలుపులజేరి మాధుర్య మొప్పగా
మురళిమ్రోయించేటి మోహనా కృష్ణా!

మబ్బులో నుంటివని, మధురమగు సంజలను
తారలను నుంటివని దగ బిలుచుచుంటినీ!
హరి విల్లులోని యా యందాల నుంటివని
ప్రియమార బిలుచుచును ప్రేమ జూపుచునుంటి! ॥మనసు॥

గోరింక జిలుకలను కోకిలలతో నేను
లేఖలంపితి స్వామి! లీలగా గావుమని!
విరహగీతము బాడి విలవిలా తపియించి
కరుణ నను జూడుమని కాంక్షించితిని స్వామి! ॥మనసు॥

మనిషి మనసే నీకు మాధవా! కోవెలగ
తెలిసికొంటిని స్వామి! దీరుగా జాగృతిని!
నీలోని ప్రేమలను నిలిపితిని నరునందు
నరుడు నీవే యనుచు నారాయణుండనుచు

మనసు మలుపులజేరి మాధుర్యమొప్పగా
మురళి మ్రోయించేటి మోహనా కృష్ణా!

# ఈ శుభోత్కరమైన

ఈ శుభోత్కరమైన యీ శరద్రాత్రిలో
నీ మధుర రూపమే నిలిచె నా కనులా!

నీ మురళి నాదాలు వినిపించు నలుదిశలు
నను బిలుచుచున్నవీ! నాథ! వే రమ్మనుచు

ఈ శుభోత్కరమైన ఈ శరద్రాత్రితో
నీ మధుర రూపమే నిలిచె నా కనులా!

నీ మురళి స్వనమువిని నిఖిలమంతా మఱచి
అలనాడు గోపికలు నాడుచును బాడుచును!
నిన్ను దర్శించిరీ నిర్మలంబగు భక్తి
నను జేరవది యేల? నాథ! నిర్దయయేల? ॥ఈ శుభో॥

వెదుకుచుంటిని స్వామి! వేయివీధులు దిరిగి
కిన్నెరను మీటుచును గీర్తనలు బాడుచును!
రమణీయమైన యీ రమ్య ప్రదేశములు
కొండ కొమ్ముల నెక్కి కూర్మి నిను బిలిచితిని! ॥ఈ శుభో॥

నీ మురళి ధ్వనులతో నిండార ననుముంచి
ఆరాటమును గూర్చి యలసటను జేర్చకుము!
నీ మధుర దర్శనము నిఖిలాత్మ జూపించి
నీ మురళి స్వనములను నిలుపుకొను నను స్వామి!

ఈ శుభోత్కరమైన యీ శరద్రాత్రిలో
నీ మధుర రూపమే నిలిచె నా కనులా!

## మధురానురాగముల

మధురాను రాగముల మాధుర్యమే చాలు
యాచింపబోనుగా యఖిలేశ కోరికల!

నీమురళి నాదాల నిధియె చాలును నాకు
ముత్యాలరాసులను మోదమున గోరనూ!

మధురాను రాగముల మాధుర్యమే చాలు!
యాచింపబోనుగా యఖిలేశ కోరికల!

బంగారు హారాలు రంగారు వస్త్రాలు
హాసవిలాసాల యాచింప బోనుగా!
ఏకాన్క నిచ్చినా యేభాగ్య మిచ్చినా
అందికొన ప్రీతితో హస్తమును జూపనూ! ॥మధురాను॥

నాభారమంతయును నీదియని బలికితిని!
నాదు సర్వస్వమును నీకు నర్పించితిని!
పలుమాట లిక యేల? భక్తి యొక్కటిదక్క
అంజలిని ఘటియించి యర్పించితిని గావ! ॥మధురాను॥

భక్తిరాగమె నాకు భద్రమైనది స్వామి!
నీప్రేమ నందుటకు నిఖిలేశ! మూలమై!
జలరాసులన్నిటిని జక్కగా దాటించు
అందాల దీవిలో నలరి నను నినుజేర్చు!

మధురానురాగముల మాధుర్యమే చాలు!
యాచింపబోనుగా యఖిలేశ! కోరికల!

## కవి భావ గీతిలో

కవి భావగీతిలో కవన కుసుమము గాను!
శిల్పి తన శిల్పమున జేర్పులవి గాదూ!
రంగు రంగులలోని రమణీయ ప్రకృతిని
చిత్రకారుడు గీయు చిత్రమది కాదూ!
కవి భావగీతిలో కవనకుసుమము గాదు!
శిల్పి తన శిల్పమున జేర్పులవిగాదూ!

ఎడతెగని ధ్వనులతో విడివడని యలలలో
ఆటుపోటులబాడు నమలగాంధర్వమిది!
ఆదిమధ్యాంతరములు సాగిపోవుట లేదు
విశ్రాంతిలేదు! ఈ విమల గీతమునకూ! ॥కవి॥

ఓంకార నాదమున యొనరుచుండెప్పుడును
నిత్య నూతనముగా నిర్మలముగను వెలయు!
ఆరిపోదెప్పుడును నాత్మజ్యోతిగ వెలయు
కలకాలముందునది కాలములు దాటునది! ॥కవి॥

అందినా జ్యోతి నీ యారిపోవగనీను,
మనసులో నున్న నిను మరువబో నెన్నడును!
జ్యోతిలో నాజ్యోతి ప్రీతి కలిసినయపుడు
శాంతి బొందుదుస్వామి కాంతిలో గలియగను!

కవి భావగీతిలో కవనకుసుమము గాను!
శిల్పి తన శిల్పమున జేర్పులవి గాదూ!

## మది క్రుంగిపోను

మది క్రుంగిపోను! మఱి మర్మవేదనలతో
మఱచి పోనోయి! నిను మాధవా హృదినీ!

జన్మజన్మము లిటుల గడిచిపోయినగాని
యీ దీక్ష మఱువనూ! యీ భక్తి మరువనూ!

మది క్రుంగి పోను! మర్మవేదనలతో
మఱచి పోనోయి! నిను మాధవా!హృదినీ!

గొంతులో నా పాట కొసమిగిలియుండినా
పాడుటకు యత్నింతు బరవశము నందుచును!
పెదవి కదిపి కృష్ణ! ప్రేమతో బాడుదును
ఈ విరహగీతినీ! యింపుగా! సొంపుగా! ॥మది॥

అందాల నీ రూపు నగుబడక పోయినా
అస్పష్టరేఖలను నగుపించినా గూడ!
నిండుచందురు వోలె నిర్మలంబుగ గూర్తు!
అందాల నా కవిత పందిరిని నిను నిలిపి! ॥మది॥

నీరసింపను నిన్ను నిరసింపలేనుగా
అందాల నామదిని చందమామవు నీవు!
దయగలిగి నప్పుడే దర్శింపగా రమ్ము!
ఆతురత బడబోను! నలత కలతను బడను!

క్రుంగి పోను! మర్మ వేదనలతో
మఱచిపోనోయి! నిను మాధవా! హృదినీ!

## అందాల కానుకలు!

అందాల కానుకలు నందుకోలేనోయి!
నీ ప్రసాదములన్ని నిరవధికములుగా!
మోయలేనోయి! నీ మోము అందాలన్ని
మురళి నిస్వనములను మోద మలరగనూ!
అందాల కానుకలు నందుకోలేనోయి!
నీ ప్రసాదములన్ని నిరవధికములుగా!

తొలిసంధ్య మలిసంధ్య తోరణములను జూపి
చెలియనగు నా మదిని పులకింప జేయుదువు!
ఆఱు ఋతువులలోని యందాలు జూపించి
ననుమాయ జేసేవు! నవనీత వింతగా! ॥అందాల॥

కమనీయ తారలను గనువిందు జాబిలిని
అందాల హరివిల్లు నాకాశమున జూపి!
పక్షులా కిల కిలల బరవశంబుగ జూపి
చిగురుటాకులు పూలు దగకాన్కు చిచ్చెదవు! ॥అందాల॥

ప్రకృతి యందాలన్ని బరికింప శ్రీకృష్ణ!
నీ రూపు రేఖలని నే నివ్వెరను బోదు!
అందాల నీ రూపు అతికినది నా కనుల!
నీ మురళినాదమే నిలిచినది నా మదిని!

అందాల కానుకలు అందుకోలేనోయి!
నీ ప్రసాదములు బహు నిరవధికముగా!

## పడతిరో! యిన్నాళ్ళు!

పడతిరో! యిన్నాళ్ళు బాడుచుంటివి గదా!
పురుషోత్తముని మిగుల బూజించి మదినీ!
కన్నార జూచితే కమలాక్షు జెలియరో!
అనుచు బలికెడి జనుల కలరి బలుకుదు నెటుల?

పడతిరో! యిన్నాళ్ళు బాడుచుంటివి గదా!
పురుషోత్తముని మిగుల బూజించి మదినీ!

కనులార కృష్ణునీ గాంచలే దది నిజము!
మనసులో గలిగేటి మమత యెటు లేదందు!
నా హృదయ స్పందనను నా హృదయ వేదనను
ఎటుల దెలుపుదు చెలియ! విమలమగు స్నేహమును! ॥పడతి॥

వినిపించు నెల్లపుడు విమల మురళీ ధ్వనులు
కనిపించు మదియందు కమలాక్షు డెల్లపుడు!
ఆదుకొను! నలరించు! అందాలు గురిపించు
తెరవెనుక కథనెటుల తెలియజేయుదు సఖీ! ॥పడతి॥

ముందు వెనుకలు నిలిచి మోదమున నవ్వించు
పాట బాడించు నను బారవశ్యము జెంద!
విహరింపజేయు నను విమల తారకలందు
వన వనాంతరములను వరుసగా త్రిప్పునూ!

పడతిరో! యిన్నాళ్ళు బాడుచుంటివి గదా!
పూజించు చుంటివీ పురుషోత్తముని మిగుల!

## ఎన్ని వసంతాలు!

ఎన్ని వసంతాలు నిలపైని గడిచినవి!
యెన్ని చిగురులు పూలు నిలపైని రాలినవి!

విరహ గీతాలతో విరహాగ్ని జ్వాలలను
ఎంత తపియించితినో! నంత దయ రాదు గద!

ఎన్ని వసంతాలు నిలపైని గడిచినవి!
యెన్ని చిగురులు పూలు నిలపైని రాలినవి!

కోకిలను జతగూడి కూయంచు కోనలో
పాటలెన్నో బాడి పరవశించితినీ!
కనికరింపవు గదా! కరుణతో దయజేసి
మంజులంబగు నాదు మనవి వినవెందుకో! ॥ఎన్ని॥

విశ్వమంతా మ్రోగు విమలమగు నీ మురళి
నా పాట గలిసినది నయముగా శ్రుతిలయల!
ఆనాటి చెలి నంచు నఱచి బలికితిగాని
చిగురంత దయరాదు! జేరరావది యేమొ! ॥ఎన్ని॥

మఱల యదె వాసంత మధురిమలు వెలసినవి
కోనలో కోకిలా కూయంచు పాడినది!
మఱల నా గొంతులో మధురమగు నీ గీతి!
వికసించుచున్నదీ విమలమగు శ్రుతిలయల!

ఎన్ని వసంతాలు నిలపైని గడిచినవి
ఎన్ని చిగురులు పూలు నిలపైని రాలినవి!

## వెన్నెలా రాత్రిలో!

వెన్నెలా రాత్రిలో చిన్ని గోపాల నిను
సన్నుతిని జేసితిని సరస గీతమునా!

కిన్నెరను మ్రోగించి వన్నెలా రాగాల
మధుర గీతాలతో మాధవా! పిలిచితిని!

వెన్నెలా రాత్రిలో చిన్నిగోపాల నిను
సన్నుతిని జేసితిని సరస గీతమునా!

తీయనీ స్మృతులన్ని తెరమీది బొమ్మలుగ
కంటిలో నడయాడె కమనీయ రూపాల!
మఱచి పోయిన కథలు మఱల మనసుకు వచ్చె
బృందావనమునందు జిందినా యందాలు! ॥వెన్నెలా॥

చిత్రముగ యతికితివి చిన్ని నా హృదయాన
శిల్పముగ నిలిచితివి జెదరనీ రూపాన!
అలలు తెరలును లేని యందాల కొలనులో
కలువపూవుగ నిలిచి కలత గలిగించితివి! ॥వెన్నెలా॥

నీపాట నీదెగా! నీ మురళి నీదెగా!
నామాట వినవుగా నంద గోపాలా!
నిను బొందగా గోరు మనసు పడు వేదనను
వినవుగా! కనవుగా! వేధింతువే గాని!

వెన్నెలా రాత్రిలో చిన్ని గోపాల నిను
సన్నుతిని జేసితిని సరస గీతమునా!

## సంగీత వెన్నెలల!

సంగీత వెన్నెలల సాహిత్య వీధులను
నంద శ్రీగోపాల నను దిరుగనిమ్మా!

మధుర గానముతోని మఱపింపగా నిన్ను
పరవశంబయిపోవ ప్రకృతి యంతయునూ!

సంగీత వెన్నెలల సాహిత్య వీధులను
నంద శ్రీగోపాల నను దిరుగనిమ్మా!

విశ్వమంతా మ్రోగు విమలమగు నీ మురళి
ఓంకార ధ్వనులతో నూహకందని యేవో!
లలితమగు రాగాల లాలిత్య మొలికించి
నా గొంతులో పలికి నాట్యమాడాలి సుమ! ॥సంగీత

మధురమగు పదములను మాణిక్యరాగాల
ముత్యాల సరముగా ముద్దులొలకాలి!
జగమంత చైతన్య జాగృతిని వెలయాలి
గాంధర్వ వీణగా కమ్మగా నాగీతి! ॥సంగీత॥

నీ విశ్వగానమున నేను లయతాళమై
మోహనంబగు ధ్వనుల మోదమందగ జగతి!
నే పాట బాడాలి! నిండు సెలయేఱుగా,
సామగానము వోలె సరసతల విరియాలి!

సంగీత వెన్నెలల సాహిత్య వీధులను
నంద శ్రీ గోపాల నను దిరుగనిమ్మా!

## నీ ప్రేమ సరితలో!

నీ ప్రేమ సరితలో నే మునుగు చుంటినీ
అంజలిని గ్రహియించి యాదరింపుము స్వామి!
నీ వలపు పాటలో నే దేలుచుంటినీ
కనికరింపగ రాద కన్నీరు దుడిచీ!
నీ ప్రేమ సరితలో నే మునుగుచుంటినీ
అంజలిని గ్రహియించి ఆదరింపుము స్వామి!

అలలు తెరలూ లేని యందాల కొలనులో
కలువ పూవుకు మల్లె కలత బడుచుంటినీ!
వెన్నెలా పువ్వులా వేల కాంతులు జిమ్మి
నా బ్రతుకు దొరలించు నవరత్న కళికలా! ॥నీ ప్రేమ॥

శ్రుతిలయలు లేని నా చోద్యమగు పాటలో
అంతులేనీ గీతి యలత జెందెగదోయి!
మురళి మ్రోయింపు! నే మోదమున శ్రుతికలిపి
పాటబాడెద స్వామి! బరవశము జెందగా నీ ప్రేమ॥

మంచు ముత్యము రీతి మనసున్నదోయ్ కృష్ణ!
గరిక పువ్వూ పైని గదులుచుంటిని కృష్ణ!
తొంగిచూడుము దయను దొరముగ నాయందు
నీ నీడ గనబడును నీటుగా మురళిలో!

నీ ప్రేమ సరితలో నే మునుగుచుంటినీ
అంజలిని గ్రహియించి యాదరింపుము స్వామి!

## మధుమాస మొచ్చింది!

మధుమాస మొచ్చింది! మావులే పూచినవి!
మఱల కోకిలపాడె మధుర గీతికనూ!

నా మనసునను గూడ నవనూత్న గీత మెదో!
ముత్యాల సరమువలె ముప్పులొలికెను నేడు

మధుమాస మొచ్చింది! మావులే పూచినవి!
మఱల కోకిలబాడె మధుర గీతికనూ!

తీయనీ స్మృతులన్ని తెరమీద బొమ్మలుగ
కంటిలో నడయాడె కమనీయ రూపాల
మఱచిపోయిన కథలు మఱల మనసుకు వచ్చె
బృందావనమునందు జిందినా యందాలు! ॥మధు॥

విమలనాదము లేవొ వినిపింప సాగెనూ!
కోనలో మాధవుడు గూర్మి పాడినయటుల!
నను బిలిచి నటులుండు నవరాగ సుధలలో
ప్రేమానురాగాల ప్రీతి బంధముతోని! ॥మధు॥

అంతులేని ప్రేమ యంచులకు బొంగెనూ!
గొంతెత్తి బాడగా కోర్కె యుదయించెనూ!
మధుమాసమా! నన్ను మాధవుని జేర్పుమా!
నిలువ నే నిల మీద నీరాక వలననూ!

మధుమాస మొచ్చింది! మధువులే పూచినవి!
మఱల కోకిల బాడె! మావు గీతికనూ!

## వేయి భావాలతో!

వేయి భావాలతో వేయి గీతాలతో
బాడుచుంటిని కృష్ణ! పాట నీ మీదా!

నీ రూపు జూపింప! నీ పాట వినిపింప!
మనవిజేయుచు నుంటి! మాధవా! కరుణింపు!

వేయి భావాలతో వేయి గీతాలతో
బాడుచుంటిని కృష్ణ! పాట నీ మీదా!

చుక్కవలె దూరాన జూతువది యేలనో,
ప్రక్కనుండీ నాదు ప్రార్థనను మన్నింపు!
చిక్కితిని నీ భక్తి చిత్రముగ, బొమ్మగా,
మక్కువగ నను ప్రేమ మన్నింపవా స్వామి! ॥వేయి॥

చందమామకు మల్లె జాలువారుచు ప్రేమ,
అందాల నీ మురళి యాలపింపుము కృష్ణ!
సెలయేటి గిరిసోన కలకలా ధ్వనులతో
నను ముంచి నను దేల్చి నాథ! దయ జూడవా! ॥వేయి॥

పిలిచి పిలిచీ నాదు ప్రేమ గీతము లోని
మధురిమలు మాసెగా మాధవా! నా కనులు!
నీలి మసకలు గ్రమ్మె నీ రూపు నెటుజూతు?
అందాల నీ మోము జంద మెటు గనుగొందు!

వేయి భావాలతో వేయి గీతాలతో
బాడుచుంటిని కృష్ణ! పాట నీ మీదా!

## చిగురు టాకుల పైని

చిగురుటాకుల పైని చిత్రమగు పూవులను
మంచు బిందువులు చెలి! మధురముగ నిలిచే!

సంధ్య కాంతులతోని సరసతలు జిందుచును
రంగు రంగుల పూల రమ్యతలు జిందెనే!

చివురుటాకులపైని చిత్రమగు పూవులను
మంచుబిందువులు చెలి! మధురముగ నిలిచే!

హేమంత కాంతయును హిమకాంతి ముసువుతో
మధుర గోపికవోలె మౌనముగ బాడుచును!
పుడమి యాకాశములు బోలుపుగా వెదుకుచును
కన్నీరు వెల్లువగ కఱిగి రాల్పుచునుండె! ॥చిగురు॥

పాట బాడగలేను బన్నుగా ఓ చెలీ!
ఆటలాడగలేను అచ్చరకు వలె నేను!
కొండ కోనలలోని కోవెలగ తీయగా
ఆలపింపగ లేను నపురూప గీతమును! ॥చిగురు॥

తొలిమబ్బులును గ్రమ్మె దీరుగా బ్రకృతిని
కనిపింపరావుగా కమనీయ సొగసులును!
నా గొంతులో పాట నా నాథు బాడగా
వెలికిరా దెందుకో! విమల గాంధర్వమున!

చిగురుటాకుల పైని చిత్రమగు పూవులను
మంచుబిందువులు చెలి! మధురముగ నిలిచే!

## ఆలపింపకు సఖి!

ఆలపింపకు సఖి! అందాల రాగాల
మేలుకొలుపకు చెలి! మేదినీశ్వరునీ!

ఎన్నెన్నొ లోకాల నెన్నెన్నొ దేశాల
విన్నపాలను వినీ చిన్నబోయెనొ విభుడు!

ఆలపింపకు సఖి! అందాల రాగాల
మేలుకొలుపకు చెలి! మేదినీశ్వరునీ!

ఆకలికి యల్లాడునట్టి పేదలగాంచి
కట్ట వస్త్రములేని కష్టజీవుల గాంచి!
దీనులను హీనులను దిశలన్ని బరికించి
ఎపుడొచ్చెనో రాత్రి! యిపుడు లేపకుడమ్మ! ॥మేలు॥

వేదనలు, రోదనలు, వేవేల ప్రార్థనలు
మనసు చినబోవగా మాధవుడు వినెనేమొ!
క్రూరమగు కార్యములు గుటిలములు గాంచెనో
మనసెంత నొచ్చెనో! మనసెంత దస్సెనో! ॥మేలు॥

కన్నార నిదురించి చెన్నార మేలుకొని
కరుణతో గాంచు మన కాంక్షలన్ని దీర్పు!
క్షణమాగవే చెలి! చెదిరిపోవును నిదుర
కలతజెందిన మదిని యలత జేకూర్పకే!

ఆలపింపకు సఖి! అందాల రాగాల
మేలుకొలుపకు చెలి! మేదినీశ్వరునీ!

## నా బ్రదుకు బాటలో!

నాబ్రదుకు బాటలో! నాజీవ యాత్రలో
నా కోర్కె దీరునా? నా మనసు బండునా?

చిన్ని కృష్ణునిగాంచి చిరునవ్వు జిందుదున?
మురళిపాటను నేను మోదమున గలియుదున?

నాబ్రదుకు బాటలో! నాజీవ యాత్రలో
నాకోర్కె దీరునా? నామనసు బండునా?

నాపాటలో మాట నయముగా దాను విని
కరుణించునా నన్ను? కామితము దీర్చునా?
కన్నీరు దుడుచునా? కలత దొలగించునా?
విడివడిన బంధమును వేగ ముడివేయునా? ॥నాబ్రతుకు॥

తేనెలొలికే నాదు తీయనీ గీతమును
రాగాలు జిందునా నవగీత భావాలు!
మనసు గఱిగీ విభుడు మదికోర్కె దీర్చునా?
అంజలిని గ్రహియించ్చి యాదరించున స్వామి! ॥నాబ్రతుకు॥

వాసంత మొచ్చినా? వన్నెలే విరిసేన?
చివురు పూవులలోని చిత్రాలు వెలిసేన?
నాప్రేమ పూదీవె యందాల కుసుమాలు
అలరారునా చెలి! యందుకొనునా స్వామి?

నాబ్రదుకు బాటలో నా జీవయాత్రలో
నాకోర్కె దీరునా? నామనసు బండునా?

## ఎందుకో తెలియనీ!

ఎందుకో తెలియనీ విరహవేదన చెలియ!
అందాల కృష్ణునీ యందుకొన కాంక్ష!

మనసులోనున్న నా మాధవుని గనలేక
ఊరువాడల వెదికి యుసురుసురు బడుచుంటి!

ఎందుకో తెలియనీ విరహవేదన చెలియ!
అందాల కృష్ణునీ యందుకొన కాంక్ష!

కనులలో నీరొలుకు గాఢచీకటి జూతు!
అలసి సొలసిపోదు! యటుజూతు నిటుజూతు!
ఆకురాలినగూడ, యలరి పువు గదిలినా
అందాల మాధవుడు నటు వచ్చెనని గాంతు! ॥ఎందుకో॥

ఆకాశవీధిలో నలతారలను గాంచి
దాగియున్నాడనుచు దన్మయముతో బొంగి!
ఒక్కొక్కతారనూ వరుస జూచుచునుందు
తెలవారుచుండునే చెలి! రాడు మాధవుడు! ॥ఎందుకో॥

చంద్ర కిరణములతో నింద్రధనుసున వెలయు
రంగులను వెదుకుదును రమణీయమూర్తినీ!
ఆర్తిబాపడు చెలియ! యాదుకొన డెందుకో!
ఆత్మలో దాగుండు ఆరుబయటకు రాడు!

ఎందుకో తెలియనీ విరహవేదన చెలియ!
అందాల కృష్ణునీ యందు కొన కాంక్ష!

## అల విశ్వపతిచేత

అల విశ్వపతిజేత యతని యానలజేత
సర్వమును దిరుగుచును జరియించు చుండే!

ఆలస్యమునులేక యలరు దీక్షనుగూడి
చరియించుచున్నదీ సకల విశ్వంభరము!

అల విశ్వపతిచేత యతని యానలజేత
సర్వమును దిరుగుచును జరియించుచుండే!

సూర్యచంద్రులుగూడ సూటిగా దిరుగుచును
దివి భువిని కాంతులను ధీరుగా నింపుచును!
లోకకల్యాణమును లోలతను సేయుదురు
జాగుసేయరు గదా! క్షణమైన వెనుజడరు! ॥అల॥

అగ్నియును వాయువును నల వనస్పతులునూ,
ఆటుపోటులు గలుగు నల సముద్రము గూడ
ఋతువులును కాలములు చూడిగా సర్వమును
ఖరుల మేలుకు నిలుచు ఖన్నుగా సిద్ధమై! ॥అల॥

ఏకాంతమున నేను నేమి జేయుచునుంటి?
పాటబాడుచు నుంటి ఖన్నుగా నినుగూర్చి!
మాలగూర్చుచు నుంటి మాధవా! నీ కొఱకు?
స్వాహసము లేనట్టి సఖిని నే గవస్వామి!

అలవిశ్వపతిజేత యతని యానలజేత
సర్వమును దిరుగుచును జరియించుచుండే!

## శారదా రాత్రి యది

శారదా రాత్రి యది! సరస వెన్నెల విరిసి,
వెండి దీవెల వాన దండిగా కురిసినది!

ధ్యానమున నుండి నే తరుణి! కిన్నెరమీటి
పాటబాడుచునుంటి బరవశము జెందుచూ!

శారదా రాత్రి యది! సరసవెన్నెల విరిసి
వెండి తీవెల వాన దండిగా కురిసినది!

పాడేటి యాగొంతు బాడుచుండెను సఖి!
మ్రోగేటి కిన్నెరయు మ్రోగుచుండెను చెలీ!
ధ్యానమున మునిగితిని దరిలేని రాగమున
నన్ను నేనే మఱచి యున్న యా సమయాన! ॥శారదా॥

తలుపు తట్టిరి యెవరో! తలుపుదెఱచితి వేగ
బాలుడొక డేతెంచె పదియేండ్ల ప్రాయమున!
పశులకాపరి యనుచు బరగ నే భావించి
పట్టెడన్నము పెట్టి యిట్టె పొమ్మంటినే! ॥శారదా॥

పట్టెడన్నము దినుచు నిట్టె నను గాంచుచును
చిఱునవ్వు నవ్వేనే చింతాకు జిగురంత!
ఒక్కొక్క పాదమును నొప్పుగా వేయుచును
వెడలిపోయెనె వాడు వెనుదిరిగి జూచుచును!

తెలవారు జాతునే చెలియ! నాగది యందు
పిల్లనాగ్రోవినీ ప్రీతితో జూచితిని!
రాత్రి వచ్చినవాడు రమణీయ కృష్ణుడని
మదిమెచ్చి మురళినీ మధురముగ వదిలెనని!

## పరమాత్మ డెచ్చట?

పరమాత్మ డెచ్చటని బరగ బ్రశ్నించితిని!
కనబడిన వారలను కన్నీరు నింపి!

నిలబడక పిచ్చిదని నిరసించిపోయిరీ
వలదొలగ రాజిలుక యొనర పైకెగిరినటు!

పరమాత్మ డెచ్చటని బరగ బ్రశ్నించితిని,
కనబడినవారలను కన్నీరు నింపి!

ఆకాశమార్గాన యంతరిక్షమునందు
చుక్కలకు వెనుక మఱి చక్కనగు స్వర్గాన!
ప్రభుపు గలడని బలికె బన్నుగా నొక్కరుడు
పలికి వేగము బోయె బరగ క్షణముండకను! ॥పరమాత్మ॥

కొండలను కోనలను కోనేరు గుడియందు
భగవానుడుండునని బరగ నొక్కడు పలికె!
ప్రకృతి యందాలలో ప్రభువుండు నని బలికె
సందేహ మేల యని సాధు పురుషుడు పలికె! ॥పరమా

నీ గీత రవళిలో నేనుంటి యిక నమ్మ!
అన్వేషణం బేల యఖిల విశ్వమునందు
నిన్ను వెదుకుచు వత్తు నీ గీతమును వినగ
ఆత్మలో బలికితివి అల మురళి స్వనములను!

పరమాత్మ డెచ్చటని బరగ బ్రశ్నించితిని!
కనబడిన వారలను కన్నీరు నింపి!

ఇల్లు వాకిలి లేని చెల్లనీ జీవులై
బ్రతుకు బరువున భారమున లాగుచుండేటి!

చెమటోడ్చు జీవులను జేరితిని యొకనాడు
చెట్టు క్రిందే వారి చక్కనీ వాసమును!

ఇల్లువాకిని లేని చెల్లనీ జీవులై
బ్రతుకు బరువును భారమున లాగుచుండేటి!

ప్రేమతో జలములను ప్రీతితో నిచ్చిరీ
పాదప్రక్షాళనము బన్నుగా జేసికొన!
అలసిపోయిన నన్ను యాదరించిరి మఱియు
అతిథ్యమును నిచ్చి యానంద బఱచిరీ!

ఒక మట్టి ముంతలో మానుగా జలములను
త్రాగుటకు నిచ్చిరీ తన్మయము జెందగా!
ఒక రొట్టె నిచ్చిరీ యొప్పుగా దినుమనుచు
ఆత్మీయతయు నటొంగ యలరు స్నేహము దొరల!

అంత రుచిగల రొట్టె యలరు నా జన్మమున
రుచి జూడలేదుగా రూఢి దెలుపుచు నుంటి!
పాత్రలో నీ జలము బరగ యమృతముగా
మది కింపు జేసెనే మాధవీ! యానాడు!

ఇల్లు వాకిలి లేని చెల్లనీ జీవులై
బ్రతుకు బరువును భారముగ లాగుచుండేటి!

## వీధి వీధిని దిరిగి

వీధి వీధిని దిరిగి విమల గృహద్వారములను
పల్లె పల్లెకు బోయి బరగ యడిగితినీ!

వెదుకుచుంటిని కృష్ణ! విమల కిన్నెర మీటి
పాడుచుంటిని కృష్ణ! పరవశము జెందుచూ!

వీధి వీధిని దిరిగి విమల గృహద్వారములను
పల్లె పల్లెకు బోయి బరగ నడిగితినీ!

బిచ్చగత్తె నటంచు బిక్ష నందించిరీ,
కడు వేదనను గాంచి కన్నీటి నొలికిరీ!
కాసుపీసములతో గనికరము జూపిరీ,
నా కొంగు నిండినది నాథ! యా కానుకల! ॥వీధి॥

కానుక లెందుకు నాకు గనికరం బెందులకు?
కలకలా నొలికేటి కన్నీ రదెందులకు?
అపురూప యాత్రయిది! యాగిపోదెన్నటికి
నిన్ను గాంచిన దాక నీరసింపను స్వామి! ॥వీధి

కొంగులో కానుకలు కొసరు మిగులక యుండ
అడిగినా వారలకు యందించెదను స్వామి!
నా మహా యాత్రలో నా దివ్యమగు దారి
సకలము సహించెదను వికలత్వ మొందకను!

వీధి వీధిని దిరిగి విమల గృహ ద్వారముల
పల్లె పల్లెకు బోయి బరగ నడిగితినీ!

# పాట బాడక నేను!

పాట బాడక నేను బ్రదుకలేను గదోయి!
పరమపురుషా! వినుము! పాట నా బ్రదుకూ!

పాట వినకను నీవు బరగ నిలువగలేవు!
పరమపురుషా వినుము! బరగ నా వినతీ!

పాటబాడక నేను బ్రతుకలేను గదోయి!
పరమపురుషా! వినుము! పాట నా బ్రతుకూ!

ఉదయ సంధ్యల యందు మధురగీతము బాడ
శ్రుతిలయలు గలుపుదువు చోద్యముగ మురళితో!
మనసార నను గాంచి మన్నింప వెందుకో!
చాటుమాటు లవేల సఖ్యతకు నడ్డేల? ॥పాట॥

కిన్నెరను మీటుచూ కీర్తనను నే బాడ
సన్నగా శ్రీమురళి జెన్నుగా బాడెదవు!
అటు జూడ! నిటు జూడ! యగుబడవు కన్నులకు
మనసులోనీ పాట మాయమగు గోపాల! ॥పాట॥

అందాల దీవిలో నలరి స్నేహము గలిగె
నా తీపి పాటకును నీ మధుర మురళికిని!
నా పాట వినక మఱి నీ మురళి మనలేదు!
నీ మురళి వినకనూ నా పాట మనలేదు!

పాట పాడక నేను బ్రతుకలేను గదోయి!
పరమ పురుషా! వినుము! బరగ నా వినతీ!

## ఈ వెండి వెన్నెలల!

ఈ వెండి వెన్నెలల యీ శరద్రాత్రిలో
పాడుచుంటిని సఖా! పరవశము జెందీ!

అల రాధికకు వోలె యల గోపికకు సరళి
కిన్నెరను మీటుచును, వన్నెలను జిందుచును!

ఈ వెండి వెన్నెలల యీ శరద్రాత్రిలో
పాడుచుంటిని సఖా! పరవశము జెందీ!

ఆకాశ మల్లియలు నలరి రాలుచునుండ
కలువ తామరపూల కాంతులను విరజిమ్మె!
నీటి పక్షులుగూడ నిరవధిక ధ్వనులతో
కనులబండువు జేసె కాంతార మంతయును! ॥ఈ వెండి॥

ఈ రమ్య స్థలమునకు నింపుగా వత్తువని
ఎదురు జూచుచు నుంటి యేకాంతమందునను!
ఈ కొండ చరియపై నింపుగా గూర్చుండి
మురళి నూదుదు వనుచు మోదమున దలచితిని! ॥ఈ వెండి॥

చాతకము దగ దెలిపె సఖియరో! కృష్ణుడూ!
మురికి వాడలనుండె మోదమున వృద్ధునికి
పరిచర్యలో నుండె బరగ యిచటికి రాడు!
అనుచు దెలుపగ నేను నాశ్చర్య మందితిని!

ఈ వెండి వెన్నెలల యీ శరద్రాత్రిలో
పాడుచుంటిని సఖా! పరవశము జెందీ!

## మనసు బడు వేదనను!

మనసు బడు వేదనను మఱి వెలికి రానీను!
కన్నీటి బాష్పముల గనిపింపనీనూ!

హా సఖా! యనుమాట నటు దూర ముంచెదను!
కిన్నెరను బ్రయోగించి కీర్తనను బాడనూ!

మనసు బడు వేదనను మఱి వెలికి రానీను!
కన్నీటి బాష్పముల గనిపింపనీనూ!

హంస చేడియతోని నటు లేఖ లంపనూ!
విమల భావములతో, విపులార్థములతోని!
చిలుక గోరింకలను జేరువుగ నే బిలిచి
మదిలోని విరహమును మఱీ దెలుపగాబోను! ॥మనసు॥

కలువ తామరలతో గల విరహమును దెలిపి
కన్నీటి ధారలను గలత నే నొలుకనూ!
చంద్ర తారకలతో సాంద్రమగు వెన్నెలల
పలుకరింపగలేను జిలుకుచును నా వేదనను! ॥మనసు॥

విరహ వేదననంత వేడి నిట్టూర్పులుగ
బిగియించితిని స్వామి! దగ పైకి రాకుండ!
నీవు గనబడినపుడు నిఖిల వేదనయంత
దర్శింప జేయుదును దగ నీదు నెదుటనే!

మనసు బడు వేదనను మఱి వెలికి రానీను!
కన్నీటి బాష్పముల గనిపింపనీనూ!

## వేద వేదాంగముల!

వేదవేదాంగముల విమలశాస్త్రములనూ
చదువలేదుగదయ్య సరస కావ్యములా!

నీ మురళిలోనుండి నేర్చినది యీ పాట!
ఆ పాటనే యిపుడు నాడిపాడుచునుంటి!

వేదవేదాంగముల విమలశాస్త్రములనూ
చదువలేదు గదయ్య సరస కావ్యములా!

మధుర గోపికవోలె మాధవా! నే నెపుడు
మధుర గీతిక బాడ మనసులోని కోర్కె!
అందాల కోనలో నలమావిపైనుండి
యలకోకిలకు వోలె నాలపింపగకోర్కె!

చిని చిన్ని పలుకులను జిన్నారి రాగాల
మనసులో వెలిసినా మధుర భావాలనూ!
అందాల నీరూపు నపురూప సుందరతను
మనసార బాడగా మాధవా! నా కోర్కె!

కొండలను కోనలను కూర్మి సెలయేటివలె
కూర్మితో నిను బిలిచి కోరి బాడాలనీ!
నాపాట పిలుపులను నాథ మది స్పందించి
ఆదరించెద వనుచు నాశతో నుంటినీ!

వేదవేదాంగముల విమలశాస్త్రములనూ
చదువలేదు గదయ్య సరస కావ్యములా!
నీ మురళిలో నుండి నేర్చినది యీ పాట
ఆ పాటనే యిపుడు నాడి బాడుచు నుంటి!

## వదలనీ కోరికవు!

వదలనీ కోరికవు! విడని చెలికాడవును!
చిరకాల బంధువుగ జేరియుంటిని నాడు!

ప్రకృతి మాతయుగూడ ప్రేమతో మనకపుడు
ముడులు వేసెనుగాద! ముచ్చటలు దీరగా!

వదలనీ కోరికవు! విడని చెలికాడవును
చిరకాల బంధువుగ జేరియుంటిని నాడు!

నీదు శ్రీ మురళికిని నాదు గీతమునకును
సరిబోలు ననుచునూ సఖియ లందఱుగూడి
పుష్పాంజలుల జల్లి పొలుపుగా దీవెనలు
అందమొప్పగ నిలిచి హారతుల నిచ్చిరీ ॥కిన్నెరను॥

అలనాటి బాంధవ్య మంత మొందెను నేడు
పూలు రాలిన మల్లె పొలతివలె నుంటినీ!
గతజన్మ వైభవము గథలుగా దలచుచును
శిధిల మందిరమందు శిల్పముగ నుంటినీ ॥కిన్నెరను॥

ఎపుడు నీరాకయని యెదురు జూచుచునుంటి
రాత్రిబవళులు నీదు రమ్య వీక్షణమునను!
నీపాద సవ్వడుల నేను గుర్తించెదను!
శబరి వలె నేనుంటి జేరదీయుము స్వామి!

వదలనీ కోరికవు! విడని చెలికాడవును!
చిరకాలబంధువుగ జేరియుంటిని నాడు!

## వింటివే చెలియరో !

వింటివే చెలియరో? విమలమగు శుభవార్త!
నా విభుడు విచ్చేయు నళినాక్షి! యీ రేయి!

మధుర మురళిని దాల్చి మల్లెమాల ధరించి
బాలకృష్ణుని వోలె భవ్య రూపముతోని!

వింటివే చెలియరో? విమలమగు శుభవార్త!
నా విభుడు విచ్చేయు నళినాక్షి! యీ రేయి!

వెన్నెలా దీవెలను వేడుకను నూగుచును
తీయనీ మురళినీ దీరుగా బాడుచును!
మెత్తనీ పాదముల మేదినీ పైనుంచి
నడుచుచును వచ్చునట! నా కుటీరంబునకు!

తళుకు తారలమెట్లు దగ స్వాగతం బీయ
యొక్కొక్క మెట్టుపై యొనర పాదము మోపి!
ధరణిపై నడుచుచును దగ గజ్జియలు మ్రోగ
మోదముగ నాయెదుట మురళి యూదును చెలియ!

చిలుకమ్మ చెప్పినది చిత్రమగు యీ వార్త!
స్వాగతం బెటు నిత్తు సరసిజాక్షుని కిపుడు!
ఆసనంబును లేదు! నలరు దీపము లేదు!
శూన్య కుటియందెటుల సుదతి! పూజింతునే?

వింటివే చెలియరో! విమలమగు శుభవార్త!
నా విభుడు వచ్చునట! నళినాక్షి! యీ రేయి!

## నూతన ప్రచురణలు

1) ఆనంద యాత్ర (లలిత గీతాలు) 20-0(
2) మంచు ముత్యాలు " 12-0(
3) శ్రుతిలయలు " 12-0(
4) శ్రీ భగవద్గీత (చతురస్ర గీతికలలో) 18-0(
5) కలబోసిన ముత్యాలు (సూక్తులు)
(100. ఆటవెలది, గీత పద్యాలలో) 20-0(
6) శ్రీరామకథా సుథాలహరి
బాలకాండము (చతురస్ర గీతికలతో) 25-0(
7) సుందరకాండము (సైతేషను నంబరు గలదు) 15-0(

## వెలువడనున్న గ్రంథములు

1) విరహగీతము (ముత్యాల సరాలలో)
2) శ్రీరామకథాసుథాలహరి (చతురస్రగీతికలలో)
(అయోధ్యకాండము)–మొదటిభాగము

ప్రతులకు :

పి. దుర్గారావు యం.ఓ.ఎల్. అడవిదేవులపల్లి P.O.
(వయా) మిర్యాలగూడ, నల్లగొండ జిల్లా : 50820